

రాష్ట్రముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి విజయవాడవద్ద కృష్ణా బ్యారేజీని తనిఖీ చేస్తున్నారు



విజయవాడలో కొత్త ట్రాన్స్‌మిటర్ : ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి విజయవాడలో 20 కిలోవాట్ల మీడియం వేవ్ ట్రాన్స్‌మిటర్‌కు ప్రారంభోత్సవంచేస్తున్న దృశ్యం



# ఆంధ్రప్రదేశ్

సంపుటి 1 ఫిబ్రవరి 1957 సంచిక 3

విషయసూచిక



— చందా —

సాలుసరి రు. 2—0—0 విడిప్రతి 0—2—0

ఆంధ్రప్రదేశ్ సమాచార పౌరసంబంధములశాఖచే ప్రచురింపబడి అజంతా ప్రింటర్సులో ముద్రింపబడినది.

# దేశంతో పాటు మీరు కూడా అభ్యుదయం పొందండి!

## మీరు మిగుల్చుకున్న డబ్బును భారత ప్రభుత్వ చిన్న మొత్తముల పొదుపు పథకంలో పెట్టుబడి పెట్టండి!

భారత దేశం యొక్క
సామాజికాభివృద్ధి కార్యక్రమమునకు, గొప్పనదీలోయ ప్రాజెక్టులకు,
రైలుమార్గములు రోడ్ల అభివృద్ధికి సహాయపడండి!

*మీ డబ్బును ఈ క్రింది గ్యారంటీడ్ సెక్యూరిటీలలో దేనిలోనైనా పెట్టుబడి పెట్టండి!*

| | |
|---|---|
| 12 సంవత్సరముల నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్లు | మెచ్యూరిటీ పొందినమీదట నూటికి ఏడాదికి 4.16 వంతుల చొప్పున వడ్డీ లభిస్తుంది. రూ. 5 లవి మొదలు రూ. 5,000 ల వాటివరకు ఈ సర్టిఫికెట్లు లభించును. వ్యక్తిగతంగా రూ. 25,000 ల వరకు కొనవచ్చును. |
| 10 సంవత్సరముల ట్రెజరీ సేవింగ్సు డిపాజిట్ సర్టిఫికెట్లు | ప్రతియేటా నూటికి 3½ వంతుల చొప్పున వడ్డీ చెల్లించబడుతుంది. రూ. 100 లవి మొదలు రూ. 25,000 లవి వరకు లభిస్తాయి. వ్యక్తిగతంగా రూ. 25,000 ల వరకు కొనవచ్చును. |
| 10 సంవత్సరముల జాతీయ ప్రణాళిక సర్టిఫికెట్లు | మెచ్యూరిటీ పొందిన మీదట నూటికి ఏడాదికి 4½ వంతుల చొప్పున వడ్డీ చెల్లించబడుతుంది. 5 రూ. లవి, 10 రూ. లవి, 25 రూ. లవి, 50 రూ. లవి, 100 రూ. లవి, 500 రూ. లవి ఇవ్వబడును. వ్యక్తిగతంగా రూ. 25,000 ల వరకు కొనవచ్చును. |
| పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకు అకౌంట్లు | డిపాజిట్లపై రూ. 10,000 ల వరకు నూటికి 2 వంతుల చొప్పున వడ్డీ చేర్చబడుతుంది. శేషముపై రూ. 15,000 ల వరకు నూటికి 1½ వంతుల చొప్పున వడ్డీ చేర్చబడుతుంది. |
| 15 సంవత్సరముల ఆన్యూటీ సర్టిఫికెట్లు | నూటికి ఏడాదికి 3½ వంతుల చక్రవడ్డీతో నెలసరి కిస్తులుగా 15 ఏండ్ల లోపున తిరిగి చెల్లించబడుతాయి.<br>జారీచేయబడు ధరలు: రూ. 3,500, రూ. 7,000, రూ. 14,000 రూ. 28,000 వ్యక్తిగతంగా రూ. 28,000 ల వరకు కొనవచ్చును. |

## ఆదాయపు పన్ను లేకుండా మీకు మంచి ఆదాయం లభిస్తుంది!

## భారతదేశ ఉజ్జ్వల భవిష్యత్తుకొరకై పెట్టుబడి పెట్టండి!

ఇతర వివరములకు, ఈ పెట్టుబళ్ళకు సంబంధించిన నియమావళికొరకు:
**నేషనల్ సేవింగ్సు కమీషనర్, సిమ్లా చిరునామాకుగాని లేక**
**రీజనల్ ఆఫీసరు, హైద్రాబాదు (దక్కన్)**
**చిరునామాకుగాని వ్రాయవలెను.**

# మూసీ ప్రాజెక్టు



మూసీ ప్రాజెక్టు నిర్మాణంవల్ల నల్లగొండ జిల్లాకు చాలా మేలు కలుగుతుంది. ఈ ప్రాజెక్టుపై పని ఇప్పుడు జరుగుతున్నది. దీనికి రూ. 118.14 లక్షలు ఖర్చు కాగలవని అంచెనా వేయబడింది. ఇది సీటీవనరు ప్రాజెక్టు. దీని నిర్మాణంవల్ల ఆహారధాన్యాల ఉత్పత్తిలో సాలీనా 15,000 టన్నుల మేరకు పెరుగుదల సంభవిస్తుంది. నల్లగొండ జిల్లాలోని ఆహారధాన్యముల కొరత తీరడమే గాక ఈ ప్రాజెక్టువల్ల జిల్లాప్రజలకు పరోక్షంగా అనేక లాభములు కలుగ గలవు.

ఈ ప్రాజెక్టు ఒక సహాయపథకంగా చేయబడింది. దీని కాలువలవల్ల సాగు అయ్యేభూమి జిల్లాలోకల్లా కరువు ప్రాంతమని ప్రతీతి జెందినది. ప్రాజెక్టు నిర్మాణానికి ఎన్నిక చేయబడినస్థలం సూర్యాపేట తాలూకాలో హైదరాబాదు-మచిలీపట్నం రోడ్డుపై చేకుమట్ల వంతెనకు దాదాపు 6 మైళ్ళ దూరంలోవున్నది. ఇది హైద్రాబాదు - మచిలీపట్నం జాతీయ రహదారిపైగల నకిరెకల్లు గ్రామానికి 8½ మైళ్ళ దూరంలో వున్నది.

ప్రాజెక్టు నిర్మింపబడే ప్రాంతంలో ఋతుపవనములవల్ల కురిసే సగటువర్షపాతం 25.79 అంగుళాలు. ఈప్రాంతపు భూములు వరిపంటకు చాలా అనువైనవి. రైతులు కూడా ప్రాజెక్టు నిర్మాణంపట్ల అత్యంత శ్రద్ధాసక్తులు కలిగివున్నారు. కాబట్టి ఈప్రాంతం త్వరితగతిని అభివృద్ధిచెందడం తథ్యం.

మూసీనదిపై డామునిర్మాణం 1954 జనవరిలో ప్రారంభింపబడింది. ఈనది మొత్తం ఆరగాణి 3510 చదరపు మైళ్ళు. డాము విశేషాలు ఇవి :

| | | |
|---|---|---|
| ఓగీ స్పిల్వే నిడివి | 2300 | అడుగులు |
| గ్రేవిటీడాము నిడివి | 300 | ,, |
| మట్టికట్ట నిడివి | 12900 | ,, |
| డాము మొత్తం నిడివి | 13200 | ,, |
| బేస్‌వద్ద డాముయొక్క గరిష్ఠపు వెడల్పు | 300 | ,, |
| లోతైన పునాదులపైగా రాతి కట్టడం గరిష్ఠపు ఎత్తు | 60 | ,, |
| పూర్తి రిజర్వాయర్ మట్టం | 638.00 | ,, |
| మట్టికట్ట గరిష్ఠపు ఎత్తు | 52.20 | ,, |
| నీటి గరిష్ఠ మట్టం | 646.00 | ,, |
| డాముపై చివరిమట్టం | 652.00 | ,, |
| మట్టికట్ట పైభాగపు వెడల్పు | 10 | ,, |
| ఎఫ్. ఆర్. యల్. పైనీరు వ్యాపించి వుండుప్రాంతం(యం. సి. అ.లో) | 217.13 | ,, |
| గరిష్ఠ వరద ప్రవాహం | 2,30,730 | క్యూసెక్కులు |
| తూములు | 2 | |

## కాలువలు (కుడివైపు ఎడమవైపు)

| | | |
|---|---|---|
| హెడ్డువద్ద కాలువ వాహక పరిమాణం | 330 | క్యూసెక్కులు |
| కాలువగర్భం వెడల్పు | 18 | అడుగులు |
| కాలువ పూర్తిసరఫరాలోతు | 6 | ,, |
| కాలువపొడవు (20+19) | 39 | మైళ్లు |

ఈరెండు కాలువలక్రిందవున్న మొత్తంభూమి 56,750 ఎకరాలు. ఈ రెండు కాలువలవల్ల ఆబీపంటకు 38,000 ఎకరాలకు సాగునీరు లభిస్తుంది. ఒక్కొక్క కాలువక్రింద 19,000 ఎకరాలు సాగు అవుతాయి.

ఈ ప్రాజెక్టుకు పెట్టబడే ఖర్చుకువచ్చే రాబడి 3.8 శాతం వుండగలదని ఆశింపబడుతున్నది. ప్రాజెక్టుక్రింద 3130 ఎకరాల 39 గుంటలభూమి నీటిలో మునుగుతుంది. శిబిరాలకు, కాలువలకు, ఇతర అవసరాలకు 555 ఎకరాల భూమిని స్వాధీనపరచుకొన వలసివున్నది. ప్రభుత్వ భూములు, పంట కాలువలకు అవసరమైన ఇతరభూమి కలుపుకొని మొత్తం 4,985 ఎకరాలభూమి ప్రాజెక్టుకు అవసరమవుతుంది.



ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి మూసీ ప్రాజెక్టును తనిఖీ చేస్తున్నారు.

ప్రాజెక్టు కొరకు సేకరింపబడిన భూమిలో పూర్తిగా నీటమునిగే భూమికీ, కొంతవరకు నీటమునిగే భూమికీ, పెద్దకాలువ భూమికీ నష్టపరిహారం ఇదివరకే చెల్లించబడింది. పరపతి పత్రాలద్వారా నష్టపరిహారం కొరకై రూ. 10.51 లక్షలు కేటాయించబడినవి. చెక్కులద్వారా ఇంతవరకు చెల్లింపబడిన నష్టపరిహారం రూ. 9.65 లక్షలు.

## పునరావాసం

ప్రాజెక్టునిర్మాణంవల్ల ఆవాసములను కోల్పోయ్యే వారికి పునరావాసం కల్పించడానికై తగుచర్యలు తీసుకొనబడుతున్నవి. ఈ చర్యలలో ముఖ్యవిశేషాలు ఇవి:

1. వ్యవసాయభూమిని స్వాధీన పరచుకొని దానిని భూములనుంచి బేదఖలు చేయబడిన వ్యక్తులకు భూ యజమానులు చెప్పినధరకు లభింపజేయుట.

ప్రాజెక్టులో మునిగిపొయ్యే గ్రామాలరైతులు తమతాలూకాలను, జిల్లాను వదిలిపెట్టి వెళ్ళడానికి వెనుదీస్తున్నారు. మొత్తం 1023 కుటుంబాలలో భూములులేనట్టి 210 కుటుంబాలకు భూములను సమకూర్చవలసి వున్నది. సమీపగ్రామాలలో ప్రభుత్వభూములులేని కారణంచేత భూములను సమకూర్చడం అవసరమవుతున్నది. భూములు లేనట్టి ఈకుటుంబాలవారిని ఇతర అభివృద్ధి ప్రాంతాలకు వెళ్ళండని కోరగా వారు నిరాకరించారు. సోలీపేటకు చెందిన 18 కుటుంబాలవారు ఖమ్మంజిల్లాలోని పాల్వంచతాలూకాలోను, దిండీ ప్రాజెక్టులోను స్థిరనివాస మేర్పరచుకోవాలని కోరుతున్నారు. ఓగోడు, ఇటుకలపాడు, సోలీపేట, రామచంద్రాపురం గ్రామాలరైతులు చాలామంది సమీపగ్రామాలలో మిగులు భూములుగల భూకామందులనుంచి భూములు కొనుక్కోవడానికి బేరాలాడుతున్నారు.

నీళ్ళచెరువును, చింతలచెరువును, మాధారం కాలువను మరమ్మతుచేసి, మూసీకాలువను ఒయ్యాలవాడచెరువులోకి పెట్టినట్టయితే లేదా చెరువునీటిమట్టాన్ని హెచ్చించినట్లయితే ఓగోడు, ఇటుకలపాడు, గ్రామాలరైతులు సులభంగా తమ మెట్టభూములను మాగాణిభూములుగా మార్చుకొని సంతృప్తులై వుంటారు. ఇతర స్థలాలకు వెళ్ళిపోవాలని కోరరు. దీనికి సంబంధించిన సర్వేపని ఇదివరకే మొదలయింది.

2. గ్రామనివేశన స్థలాలకు భూములను స్వాధీనపరచుకొనుట :

సూర్యాపేట తాలూకాలోని సోలీపేట, రామచంద్రాపురం గ్రామాలు, నల్లగొండతాలూకాలోని ఓగోడు, వల్లభాపురం గ్రామాలు నీటమునిగిపోతాయి. వీటిలో వల్లభాపురం చిన్న గ్రామంకాబట్టి ఈగ్రామస్తులకు కొత్తగ్రామం నిర్మించనక్కరలేదు. వల్లభాపురం గ్రామస్తులలో చాలామందికలాలీలు. వీరు కొత్తగా నిర్మించబడే ఓగోడు, రామచంద్రాపురం, నోమూల గ్రామాలలో స్థిరపడిపోవడానికి ఇష్టపడుతున్నారు. యాభై కుటుంబాలవారు వల్లభాపురం గ్రామంయొక్క బంచరాయి ప్రాంతంలో గుడిసెలు కట్టుకోవాలని చూస్తున్నారు.

ఓగోడు గ్రామరైతులు తమ కొత్తగ్రామం కొరకు స్థలనిర్ణయం చేశారు. 54 ఎకరాల 16 గుంటల విస్తీర్ణంకల 8 స్థలాలను సేకరించాలని అనుకుంటున్నారు. సోలీపేట, రామచంద్రాపురం గ్రామాలరైతులుకూడా స్థలాలు నిర్ణయం చేశారు. ఎన్నికచేయబడిన స్థలములు గట్టినేలలు. పునాదులకు త్రవ్వడానికీ అనువైనవి. నేలలు మిట్టపల్లాలులేకుండా చదరంగా వున్నవి. త్రాగేనీరుకూడా బాగాలభిస్తుంది. ఈ స్థలాలను జిల్లాకలెక్టరు, సివిల్‌సర్జనుచూచి తమ ఆమోదం తెలిపారు కూడా.

3. కొత్తగ్రామాలలో తాత్కాలికంగా గుడిసెలను కట్టుట.

4. మంచినీటిబావులు, చావడీలు నిర్మించుట.

5. కొత్తగ్రామాలకు రోడ్లు వేయుట.

6. బేదఖలు అయిన గ్రామస్తులు కొత్తగ్రామాలకు చేరుకోవడానికి రవాణా సౌకర్యాలు ఏర్పాటు చేయుట.

7. ఇండ్ల నిర్మాణానికి పనికివచ్చే ఇటుకలు, కలప, జింకురేకులను ప్రభుత్వం పెద్దయెత్తున సేకరించి పక్కా ఇండ్ల నిర్మాణంకొరకై సరఫరా చేయుట.

8. ఇప్పుడున్నవాటికి బదులుగా మత, పూజాస్థలాలను నిర్మించుట.

9. పాఠశాలలు, మరుగుకాలువలు, గ్రామమందిరాలు, శిశుసంక్షేమ కేంద్రాలు, ప్రసూతివార్డులు నిర్మించుట.

10. రైతులు వ్యవసాయానికి ఎడ్లు, దున్నపోతులు, పనిముట్లు కొనుక్కోవడానికీ, భూములను అభివృద్ధి పరచుకోవడానికీ తక్కావి ఋణాలు ఇచ్చుట. ( 9 వ పేజీలో )



*మూసీ ప్రాజెక్టు స్థలం — మరొక దృశ్యం*

# స్త్రీల పొదుపుపక్షం

ఆంధ్ర ప్రాంతంలో స్త్రీల పొదుపు పక్షాన్ని ప్రారంభించడానికై హైదరాబాదులోని ఆంధ్ర యువతీమండలి హాలులో 17-1-1957 న బహిరంగసభ జరుపబడింది. హాలూ, ప్రవేశమార్గమూ చిన్నమొత్తాల నిల్వల ప్రణాళికను గురించి ప్రబోధించే ప్లకార్డ్సు, పోస్టర్లతో చక్కగా అలంకరింపబడినవి. ఈవుత్సవానికి చాలామంది వచ్చారు.

హైదరాబాదు ఆంధ్ర బాలానంద సంఘంవారి ప్రార్థనతో సభ ప్రారంభమయింది.

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి సభకు అధ్యక్షత వహించారు. ప్రాంతీయ నేషనల్ సేవింగ్సు ఆఫీసర్ శ్రీ ఇ. జగన్నాథాచారి సభికులకు స్వాగతం చెప్పారు. పొదుపు వుద్యమం విషయంలో జరిగిన కృషిని గురించిన నివేదికను శ్రీమతి టి. జి. హైమవతి, ఉపాధ్యక్షురాలు (స్త్రీల పొదుపు ఉద్యమం) చదివారు. శ్రీమతి ఏ. శ్యామలాదేవి, వైస్ చైర్మన్ (స్త్రీల పొదుపు రాష్ట్ర సలహాసంఘం) డా. ఎస్. రాధాకృష్ణన్. శ్రీమతి హన్నా సేన్, శ్రీమతి కుసుం త్రివేది, డా. పట్టాభి సీతారామయ్య గార్లు పంపిన సందేశాలను చదివారు.

రాష్ట్ర ఆర్థికమంత్రి శ్రీ కళా వెంకటరావు యీ పక్షాన్ని ప్రారంభిస్తూ, అభివృద్ధి ప్రణాళికలు, పథకాలద్వారా ప్రజల జీవన ప్రమాణాభివృద్ధికి ప్రభుత్వం గైకొన్న చర్యను గురించి వివరించారు. ఈ పథకాల విజయానికవసరమైన డబ్బును పేదజనులు, గ్రామీణులనుంచి చిన్న మొత్తాలు అప్పులుగా యెందుకు తీసుకొనవలసి వస్తున్నదో కూడా ఆయన వివరించారు. ప్రతివ్యక్తి రోజుకొక దమ్మిడీ వెనుక వేసినా, సంవత్సరానికి సులభంగా రూ. 5 నేషనల్ సేవింగ్సుకి పెట్టుబడి పెట్టవచ్చునని ఆయన చెప్పారు.

ఇండియా నేషనల్ సేవింగ్సు కమీషనర్ శ్రీ కె. ఎస్. మల్‌హోత్రా కూడా మాట్లాడారు. దేశభక్తులు, సాంఘిక సేవా పరాయణులైనవారంతా చిన్న మొత్తాల పొదుపు సందేశాన్ని అందరికీ తెలియచేయాలనీ, ఆర్జించేసమయంలో యిప్పటికంటె ఎక్కువగా డబ్బును యెలా వెనుకవేయాలో వారికి వివరించాలనీ చెప్పారు. ఆఖరికి పిల్లలకు కూడా పొదుపుచేసే అలవాటును నేర్పాలని చెప్పారు.

స్త్రీల పొదుపు వుద్యమం రాష్ట్ర సలహాసంఘం సభ్యురాలు శ్రీమతి షామిమీ జాక్రీ వుర్దూలో మాట్లాడారు. ఆమె పొదుపువల్ల కలిగే లాభాలనుగురించి హృదయాలకు హత్తుకునేట్టు మాట్లాడారు.

సాధ్యమైనంత యెక్కువ డబ్బును వెనుకవేసి, నేషనల్ సేవింగ్సు సెక్యూరిటీలకి పెట్టుబడి పెట్టమని సభను ముగిస్తూ ముఖ్యమంత్రి ప్రజలందరికీ విజ్ఞప్తి చేశారు.

ఇండియన్ నేషనల్ థియేటర్ స్థానిక నటబృందం "పొదుపు" అనే తెలుగు ఏకాంకికను ప్రదర్శించారు.

ఆర్గనైజరు శ్రీమతి ఎల్. సత్యవతీదేవి వందనసమర్పణతోను, హైదరాబాదు ఆంధ్ర బాలానంద సంఘంవారు పాడిన జాతీయ గీతంతోను సభ ముగిసింది.



# ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయాభివృద్ధి

శ్రీ ఐ. జె. నాయుడు, ఐ. ఏ. యస్.
వ్యవసాయశాఖ డైరెక్టరు.

1956 నవంబరు 1 వ తేదీన జరిగిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రావతరణ రాజకీయంగానే కాక వ్యవసాయరంగంలోని పరిస్థితులదృష్ట్యా కూడా చాలా ప్రధానమైన సంఘటన. ఆనాటితో విలీనమైన ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలోని వ్యవసాయ సంపదలు పరస్పరం దోహదకారులై ఉండడంచేత ఆంధ్ర—తెలంగాణాప్రాంతాల సంలీనం ప్రత్యేక ప్రాముఖ్యతను వహిస్తున్నది. ఆంధ్ర ప్రాంతం ఆహారపదార్థాల ఉత్పత్తిలో మిగులు ప్రాంతం. బియ్యం ఎగుమతికి కూడ అవకాశముంది. అంతేగాక పొగాకు, వేరుసెనగ, ఉల్లిగడ్డలు, మిర్చి, బెల్లం, పండ్లు వగైరా వ్యాపారపంటలలో కూడా ఇది మిగులు ప్రాంతమే. పోతే తెలంగాణాప్రాంతం పప్పుదినుసులు, నూనెగింజల ఉత్పత్తిలో రాష్ట్ర వ్యవసాయసంపదకు దోహదంచేస్తున్నది. హైదరాబాదురాష్ట్రం విచ్ఛిత్తి కావడంతో మొక్కజొన్న, రాగి, ఆముదాలు, పొగాకు, నువ్వులు, పసుపు మొదలైన పంటలు పండే విశాలమైన ప్రాంతమే కాకుండా, పూర్వ హైదరాబాదు రాష్ట్రంలో వరి పండే ప్రాంతం దాదాపు అంతా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో కలిసిపోయింది. కాగా వరి, జొన్నలు, పప్పుదినుసులు వగైరా ఆహారపంటలలోను, వేరుసెనగ, ఆముదాలు, నువ్వులు మొదలైన నూనెగింజల ఉత్పత్తిలోను, పొగాకు, మిర్చి, చెరకు, ఉల్లిగడ్డలు, పసుపు మొదలైన వ్యాపార పంటలలోను, మామిడి, అరటి, నిమ్మజాతులు వగైరా పండ్లఉత్పత్తిలోను భారతదేశంలోని వ్యవసాయరంగంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం అత్యంత ప్రధానమైనస్థానాన్ని అలంకరిస్తున్నది. ఇది ఇలావుండగా రాష్ట్రంలోని రెండు పెద్దనదులు— గోదావరి, కృష్ణా నదీజలాల వినియోగంతో ఆంధ్ర, తెలంగాణాలలో ఇంకా ఎక్కువ ప్రాంతాలకు ఇరిగేషన్ వసతులను కల్పించడానికి జరిగే ప్రయత్నాలవల్ల నూతన ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర వ్యవసాయాభ్యుదయ కార్యక్రమాలకు మంచి భవిష్యత్తు వుంటుంది.

దక్షిణభారతంలోని రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ పెద్దది. దీని విస్తీర్ణం 1,10,250 చ. మై; జనాభా 3·22 కోట్లు. భారతదేశంలోని నూతన రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం జనాభా ప్రాతిపదికపై నాలుగవ, విస్తీర్ణం దృష్ట్యా ఐదవ స్థానాన్ని ఆక్రమిస్తున్నది. భారతదేశంలోని సముద్రతీరంలో ఆరవవంతు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో వుంది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని 706 లక్షల ఎకరాల భౌగోళిక విస్తీర్ణానికిగాను 1954-55 అంచనాలనుబట్టి రాష్ట్రంలో పంటవేసినవిస్తీర్ణం 289 లక్షల ఎకరాలు : అంటే మొత్తం విస్తీర్ణంలో 41 శాతం. ఈ విస్తీర్ణంలో సుమారు 67 లక్షల ఎకరాలు లేక 22·4 శాతం భూమికి నీటి పారుదల సౌకర్యాలు వున్నవి. నాగార్జునసాగర్, తుంగభద్ర ప్రాజెక్టులు మొదలైన బృహత్‌ప్రణాళికలు పూర్తిఅయినప్పుడు ఇంకా ఎక్కువ విస్తీర్ణంలో నీటిపారుదల లభించి, తద్వారా ఆహారధాన్యాలు, ప్రధానమైన వ్యాపార పంటలలో ఇతోధికమైన అధికోత్పత్తి సాధ్యమవుతుంది.

## ప్రధానమైన పంటలు

1954-55 అంచనాలనుబట్టి ఆంధ్రప్రదేశ్‌లో 217 లక్షల ఎకరాల విస్తీర్ణంలో ఆహారపదార్థాలు పండించబడుతున్నవి. ఇందులో 185 లక్షల ఎకరాలలో ఆహారధాన్యాలు, 32 లక్షల ఎకరాలలో పప్పుదినుసులు పండుతున్నవి. ఆహారధాన్యాలలో ప్రధానమైనవి బియ్యం, జొన్న, సజ్జ, మొక్కజొన్న మొదలైనవి. రాష్ట్రంలో 47 లక్షల ఎకరాలలో నూనెగింజల పంటల వుత్పత్తి జరుగుతున్నది. వీటిలో ముఖ్యమైనవేరుసెనగ 28 లక్షల ఎకరాలలో పండుతున్నది. ఇతర వ్యాపారపంటలు ప్రత్తి, మిర్చి, పొగాకు, చెరకు, పసుపు మొదలైనవి. మొత్తం పంటపండిన విస్తీర్ణం 298 లక్షల ఎకరాలకుగాను ఆహారపంటలు 217 లక్షల ఎకరాలలో, అంటే 73 శాతం విస్తీర్ణంలోపండుతున్నవి. మిగిలిన 27 శాతం విస్తీర్ణంలో ఆహారేతర పంటలు పండించబడుతున్నవి,

నూతన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో వ్యవసాయాభివృద్ధికి అవకాశాలు పుష్కలంగా వున్నప్పటికీ, కొన్ని ఇబ్బందులు, సమస్యలు లేకపోలేదు. భారతదేశం మొత్తంమీద చూస్తే ఆహారధాన్యాల అధికోత్పత్తి, ముఖ్యంగా బియ్యం వుత్పత్తిలో పెరుగుదల మంచిదే అయినప్పటికీ ఇంకా ఎక్కువగా అనేకప్రాంతాలకు నీటిపారుదల సౌకర్యాలు కల్పించి తీవ్రతరమైన వ్యవసాయ పద్ధతులను, ఇతర అభివృద్ధి విధానాలను అనుసరించినప్పుడు బియ్యం వుత్పత్తి ఇంకా పెరగడం, తత్ఫలితంగా వాటిని విడుదలచేసే సమస్య వుత్పన్నంకావడం, ధరలు పడిపోవడంకూడా సంభవిస్తుంది. ఇటువంటి దుష్ఫలితాలను నిరోధించడానికి ప్రస్తుతం విదేశ మార్కెట్లలో గిరాకీగల జి. ఇ. బి. 24, యం. ఏ. యు 19, ఎస్. ఎల్. ఓ 16, వసుమతి వగైరా సన్న బియ్యం రకాలను ఎక్కువగా వుత్పత్తిచేయడానికి కేంద్రీకృతమైన కృషిచేయాలని నిశ్చయించబడింది.



కాకినాడ - పెద్దాపురం కమ్యూనిటీ ప్రాజెక్టు ప్రాంతంలో ఏర్పాటుచేయబడిన ఫలప్రదర్శనం దృశ్యం

## సంతృప్తి, స్తబ్ధత పనికిరాదు

అనేక వ్యవసాయ పంటలవిషయంలో మన రాష్ట్రంలో అమోదకరమైన పరిస్థితులు వున్నప్పటికీ మనం కేవలం సంతృప్తిపడి వూరుకోకూడదు. ద్వితీయ పంచవర్షప్రణాళిక లక్ష్యాలలో జాతీయాదాయం 25 శాతం వృద్ధిచేయుట ప్రధానమైనది. జాతీయాదాయంలో 100 కి 50 వంతులు వ్యవసాయోత్పత్తులద్వారా లభిస్తూ, ప్రధానంగా వ్యవసాయ దేశమైన భారతదేశంవంటి చోట్ల గరిష్ఠ వుత్పత్తి సాధించడంద్వారానే అభ్యుదయం సాధ్యమవుతుంది. ఆంధ్రదేశంలో పంటల దిగుబడి భారతదేశం మొత్తంలో పంటల సగటు దిగుబడి కంటే ఎక్కువగా వుంది. కాని తెలంగాణా ప్రాంతంలో దిగుబడి తక్కువ. అందువల్ల తెలంగాణా ప్రాంతంలో వివిధ ఆహార, వ్యాపారపంటలకు ఎకరంలో సగటు దిగుబడిని అభివృద్ధిచేయడానికి ప్రయత్నించడం నూతనరాష్ట్రానికి ప్రధానమైన సమస్యగా పేర్కొనవచ్చు. తెలంగాణా ప్రాంతంలోని ఎకరానికి సగటుదిగుబడిని కనీసం ఆంధ్ర ప్రాంతంలోని దిగుబడితో సమానంగానైనా పెంపొందించడం అత్యవసరం. ఉదాహరణకు, 1954-55 లో తెలంగాణా ప్రాంతంలో ఎకరానికి బియ్యం సగటు దిగుబడి 685 పౌనులు; అదే, ఆంధ్ర ప్రాంతంలో 1293 పౌనులు; ఇదేవిధంగా తెలంగాణా ప్రాంతంలో జొన్నపంట దిగుబడి ఎకరానికి 318 పౌనులు. ఆంధ్ర ప్రాంతంలో 583 పౌనులు. తెలంగాణా ప్రాంతంలో ఎకరానికి ఎండుమిర్చి 222 పౌనులుమాత్రమే లభిస్తుండగా, ఆంధ్ర ప్రాంతంలో 936 పౌనులు పండుతున్నవి. అందువల్ల తెలంగాణా ప్రాంతంలో ఎకరానికి సగటు దిగుబడులను తక్షణం పెంపొందించవలసిన ఆవశ్యకత ఎంతోవుంది. నీటిపారుదల సౌకర్యాలను ఇతోధికంగా అభివృద్ధిచేయడం, మేలురకం విత్తనాల వాడకం, పరిస్థితులకు తగిన వ్యవసాయ విధానాలను అనుసరించడం, రసాయనిక ఎరువులను సక్రమంగా వినియోగించుకోవడం మొదలైన చర్యల ద్వారా యీ అభివృద్ధిని సాధించవచ్చు. పంటల దిగుబడిని హెచ్చించడంలో నీటిపారుదల సౌకర్యాలను పెంపొందించడం అతి ప్రధానమైన చర్య. తెలంగాణా ప్రాంతంలో మొత్తం పంటవేసిన 116 లక్షల ఎకరాల విస్తీర్ణానికిగాను 18 లక్షల ఎకరాల విస్తీర్ణానికి మాత్రమే నీటిపారుదల సౌకర్యాలు లభిస్తున్నవి. ఆంధ్రప్రాంతంలో చూస్తే 49 లక్షల ఎకరాలకు నీటిపారుదల వసతులు సమకూర్పబడినవి. నిర్మాణంలోవున్న నదీలోయ ప్రాజక్టులు పూర్తిచేయబడి, తీవ్రతరమైన వ్యవసాయ పద్ధతులు అనుసరించబడినప్పుడు పంటల దిగుబడి తప్పనిసరిగా ఎక్కువవుతుంది. వీటికితోడు నీటిపారుదల సౌకర్యాలను అభివృద్ధిచేసే చర్యలుగా ఆయిల్ ఇంజన్లు, ఎలక్ట్రిక్

మోటారు పంపుసెట్లు, ఫిల్టర్ పాయింటు గొట్టపుబావులు మొదలైన సాధనాలను భారీయెత్తున వినియోగించుకోవడానికి కల అవకాశాలనుకూడా మనం పరిశీలించాలి.

పంటల దిగుబడిని పెంచడంలో అభివృద్ధికరమైన మేలురకం విత్తనాల వినియోగంకూడా ప్రధానమైనపాత్ర వహిస్తుంది. దీనివలన దిగుబడిని కనీసం 10 నుండి 15 శాతం వరకు పెంచవచ్చు. రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలకు ఆయా ప్రాంతాలలోని వివిధ పరిస్థితులకు అనుగుణంగా ఎక్కువ దిగుబడి కలిగి, తెగుళ్లను నిరోధించగల అనేక మేలురకం పంట విత్తనాలను రాష్ట్రంలోని వ్యవసాయశాఖ పరిశోధన కేంద్రాలలో రూపొందించటం జరిగింది. వ్యవసాయశాఖ డిపోల ద్వారా యీ విత్తనాలు లభ్యమయ్యే ఏర్పాట్లుకూడా చేయబడినవి. ద్వితీయప్రణాళిక కాలంలో సాధ్యమైనంతవరకు ఈ మేలురకం విత్తనాలను ఎక్కువగా వాడి చెప్పుకోదగిన సత్ఫలితాలను పొందాలని సంకల్పించబడింది.

## రసాయనిక ఎరువుల వినియోగం

వరిపంటలోను, చెరకు, పొగాకు, మిర్చి మొదలైన ఇతర పంటలలోను ఆంధ్రప్రాంతంలో లభిస్తున్న ఎక్కువ దిగుబడి రసాయనిక ఎరువులను భారీయెత్తున వాడడంవలనే సాధ్యమవుతున్నదని చెప్పవచ్చు ఆంధ్రప్రాంతంలో ప్రస్తుతం అమోనియం సల్ఫేటు సాలుకు సుమారు 95 వేల టన్నులు ఉపయోగించబడుతున్నది; తెలంగాణా ప్రాంతంలోని వినియోగం సుమారు 20 వేల టన్నులు మాత్రమే. నత్రజనితో కూడిన రసాయనిక ఎరువులను ఎక్కువగా వినియోగించే రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ ఒకటి. నీటి పారుదల సౌకర్యాలు అధికమై, ఆంధ్రలోని వ్యవసాయదార్లకు రసాయనిక యెరువుల వినియోగాన్ని గురించి సదభిప్రాయం ఎక్కువగా ఏర్పడినప్పుడు ద్వితీయ ప్రణాళిక చివరికాలానికి సంవత్సరానికి 2 లక్షల టన్నుల వరకు యీ ఎరువుల వినియోగం జరుగవచ్చు. రసాయనిక ఎరువుల వల్ల కలిగే వుపయోగం వాటిని మామూలు ఎరువులకు తోడుగా, జాగ్రతగా వాడుకొనే పద్ధతులమీద ఆధారపడి వుంటుంది. ఆంధ్ర ప్రాంతంలో మాగాణి భూములకు పచ్చిఆకు ఎరువు ఉపయోగించే పద్ధతి బహుళంగా వ్యాప్తిలో వుంది. ఈ అలవాటువల్లనూ, రసాయనిక ఎరువుల వినియోగంవల్లనూ ఆ ప్రాంతంలో వరిపంటకు ఎక్కువగా దిగుబడి లభించడానికి అవకాశం కలుగుతున్నది. రసాయనిక ఎరువులవల్ల కలిగే సత్ఫలితాలు, ప్రయోజనాలు ఇంకా ఎక్కువ కావాలంటే పచ్చిఆకు ఎరువు, మామూలు ఎరువు, కంపోస్టు మొదలైన సానిక ఎరువుల వుత్పత్తి, వినియోగాలనుకూడా సాధ్యమైనంత వరకు పెంపొందించుకోడం అవసరం. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో యీ విషయంలో శ్రద్ధతో కృషిజరుగుతుంది. పచ్చి ఎరువు పంటలను పండించే అలవాటు తెలంగాణా జిల్లాలలో అవసరమైనంతగా వ్యాప్తిలోకి రాలేదు. అందువల్ల పంటలకు సక్రమ పద్ధతులలో ఎరువులు వేయడానికీ, తద్వారా ఎక్కువ పంట పండించడానికీ అవకాశం కలిగే విధంగా జనుము, ద్యాంచా, నీలి, పిల్లిపెసర వగైరా పంటలను పండించే అలవాటు పెంపొందించచేయడం అవసరం.

జపాను పద్ధతి సాగులోగల అనేక అభివృద్ధికరమైన వ్యవసాయ విధానాలు రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో అప్పుడే ప్రజామోదాన్ని పొంది వ్యాప్తిలోకి వచ్చినవి. రైతుల పొలాలలో సాధించబడిన ఫలితాలను పరిశీలిస్తే ఈ పద్ధతివల్ల 25 నుండి 33 శాతంవరకు దిగుబడి ఎక్కువయినటుగా స్పష్టమవుతున్నది. క్రమంగా ఈ పద్ధతిని ఇంకా వ్యాప్తిలోనికి తెచ్చి ద్వితీయ ప్రణాళిక కాలంలో పంటల విస్తీర్ణంలో అధికభాగానికి దీన్ని విస్తరింపజేయడం అవసరం.

వచ్చే సంవత్సరాలలో పెద్దపెద్ద విస్తీర్ణంగల ప్రాంతాలకు నీటి పారుదల సౌకర్యాలు కల్పించే కార్యక్రమాలు సిద్ధం చేయబడినప్పటికీ రాష్ట్రంలో ఇంకా అనేకప్రాంతాలలో వర్షాధార పరిస్థితులమీదనే పంటలు ఆధారపడవలసి వుంటుంది. అటువంటి ప్రాంతాలలో పంటల వుత్పత్తిలో మనం సాధించగల విజయం ఆ ప్రాంతాలలో పడే వర్షపాతానికి పరిమితమై వుంటుంది ఋతుపవనాలలోని ఒడుదుడుకుల వలన అటువంటి ప్రాంతాలు తరచుగా క్షామపరిస్థితులకు లోనవుతుంటాయి. అటువంటి ప్రాంతాలలో పంటల దిగుబడిని ఎక్కువచేసే ఉద్దేశంతో భూసార పరిరక్షణ, నీటి నిలువలు మొదలైన విషయాల మీద ఎక్కువగా శ్రద్ధవహించి కృషి చేయవలసి వుంటుంది.

## ఫలోత్పత్తి

నూతన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం మామిడిపండ్లు, నిమ్మ వగైరా పులుపుజాతి పండ్లకు ప్రసిద్ధి అన్న విషయం అందరికీ తెలిసిందే. ఈరెండు రకాల పంటలు వ్యాప్తిలోకి రేపడానికి అనుకూలమైన ప్రాంతం రాష్ట్రంలో ఇంకా చాలావుంది. ఈ పండ్ల పంటలను సాధ్యమైనంత ఎక్కువ ప్రాంతానికి వ్యాపింపజేయడానికి అవసరమైన నాట్ల పరికరాలు మొదలైన విషయాలనుగురించి శ్రద్ధగా యోచించి యీ సమస్యలను పరిష్కరించవలసి వుంటుంది. ఈలక్ష్యసాధనకై ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఒక పథకం తలపెట్టబడింది. దీని క్రింద క్రొత్తగా తోటలునాటడానికి ఎకరానికి 300 రూ. ల చొప్పున దీర్ఘకాలిక ఋణాలు, పాతతోటలను అభివృద్ధిచేయడానికి ఎకరానికి 15 రూ. ల చొప్పున స్వల్పకాలిక ఋణాలు మంజూరు చేయడానికి సంకల్పించబడింది. ఈపథకం రాష్ట్రంలోని పండ్లతోటల వ్యవసాయదారులకు చాలా సహాయకారిగా వుంటుందనడంలో సందేహంలేదు. ద్రాక్షపంట తెలంగాణా ప్రాంతంలో బాగా వ్యాప్తిలోకి వచ్చి ఆంధ్ర ప్రాంతానికికూడా క్రమంగా ప్రాకుతున్నది. పండుయొక్క నాణ్యత దృష్ట్యాను, యీ పంటవలన కలిగే ఆదాయందృష్ట్యాను యిది చాలా ప్రధానమైన పంట. అనాబే షాహీ అనే హైదరాబాదు ద్రాక్ష ఆంధ్ర రాష్ట్రంలోకూడా పండించడానికి చాలా అనుకూలమైనది అందువల్ల అనుకూలమైన అన్ని ప్రదేశాలకు ఈ పంటను వ్యాపింపచేయడానికి చర్యలుతీసుకోడం చాలా అవసరం. నూతనరాష్ట్రంలో యీవిషయం శ్రద్ధగా పరిశీలింపబడుతుంది. జీడిమామిడి, అరటి, ఏపుల్, జామ, సపోటా మొదలైన పళ్ల అభివృద్ధికికూడా రాష్ట్రంలో అనేక అవకాశాలు వున్నాయి. పండ్లపంటల విస్తీర్ణము, వుత్పత్తి అధికమైనప్పుడు వాటిని విడుదలచేసే మార్గం కష్టతరమైన సమస్యగా పరిణమించవచ్చు. మామూలుగా పండ్లకు మంచిధరలే వుంటాయి. కాని ఎక్కు

వగా వుత్పత్తిజరుగుతున్న తరుణాలలో ధరలు తప్పక పడిపోతాయి. కాబట్టి ఎక్కువగా వుత్పత్తిజరిగిన తరుణాలలో మిగిలిపోయిన పండ్లను నిలువచేసుకొనే సౌకర్యాలు, వాటినుండి వుత్పత్తిచేయబడే పదార్థాలు సంవత్సరం పొడుగునా లభించే ఏర్పాట్లు చేసుకోవడం చాలా అవసరం. రెండు సంవత్సరాలకు పైగా కోడూరులో పండ్లను నిలువచేసే యంత్రం పనిచేస్తున్నది. దీనివలన పండ్లను నిలువచేసుకొనే ఏర్పాట్లయొక్క విలువ, అవశ్యకత స్పష్టంగా రుజువైంది. అక్కడ 200 రకాల పండ్ల రసాలమిశ్రమాలు తయారు చేయబడినవి వీటిలో 66 రకాలు మార్కెట్లోకూడా విడుదల చేయబడినవి. ఇవన్నీ చాలా రుచిగావుండి, ప్రజలకు ఉపయోగంగా వుండడంచేత అప్పుడే వాటికి మంచి పేరు వచ్చింది. అందువల్ల పండ్లను నిలువచేసే పరిశ్రమను అభివృద్ధిపరచి సాధ్యమైనంత ఎక్కువగా సీజనులో మిగిలిపోయిన పండ్లను సద్వినియోగపరచుకొని, వాటి పదార్థాలు సంవత్సరం పొడుగునా లభించే ఏర్పాట్లు చేసుకొని తద్వారా పండ్ల వ్యవసాయం ఎంత లాభదాయకమైందో రుజువుపరచడం అవసరం.

## వ్యవసాయ వ్యాప్తి - పరిశోధన

పైన పేర్కొనబడిన వివిధ అభివృద్ధి కార్యక్రమాలను వ్యవసాయశాఖలోని వ్యాప్తి విభాగంద్వారా నిర్వహించాలని ఉద్దేశించబడింది. వ్యవసాయవ్యాప్తి విభాగం ఎంత విస్తృత పరిధిలో సమర్థవంతంగా పనిచేసినప్పటికీ, దానికి అనుగుణంగా సమర్థవంతమైన పరిశోధన కార్యక్రమం జరుగనిదే అంతగా అభ్యుదయాన్ని సాధించలేదు. ఇతర శాస్త్రాలలోవలె వ్యవసాయ శాస్త్రంలోకూడా పరిశోధన, నూతన విధానాలు, క్రొత్త అభిప్రాయాలు, క్రొత్తపరికరాలు నిరంతర అభివృద్ధికి పునాదులు. ఇవే ఏదేశంలోనైనా వ్యవసాయాభివృద్ధికి మూలకారణాలు. అందువల్ల నూతనరాష్ట్రంలో ప్రతి పంటకు లేక పంటల సమూహానికి విడివిడిగా శాఖలను ఏర్పాటుచేసి పరిశోధనా కార్యక్రమాన్ని పటిష్టంచేయాలని, తద్వారా ఆయా పంటలమెడ అవసరమైనశ్రద్ధతో కృషిచేసి వాటి అభివృద్ధిని సాధించాలనీ సంకల్పించబడింది. ద్వితీయపంచవర్ష ప్రణాళిక కాలంలో 128.16 లక్షల వ్యయంతో 87 పరిశోధన పథకాలను నిర్వహించాలని సంకల్పం. ఈ పథకాలు పలోత్పత్తి, కూరగాయలు, ఆకర్షణీయమైన ఉద్యాన కృషి మొదలైనవాటితోపాటు వివిధ వ్యవసాయ పంటలలో సమగ్రమైన అభివృద్ధిని సాధించడానికి వుద్దేశించబడినవి. ఆంధ్ర - తెలంగాణా ప్రాంతాలలోని వ్యవసాయదార్ల ప్రయోజనార్థం బాపట్లలోను, రాజేంద్ర నగరులోను ప్రాంతీయ పద్ధతిపై పరిశోధన కార్యక్రమాలను అభివృద్ధి చేయడానికికూడా నిశ్చయించబడినది. ఇందువల్ల రాష్ట్రంలోని అన్ని ప్రాంతాల అవసరాలు తీర్చడానికి వీలవుతుంది.

వ్యవసాయవిద్య విషయంలో ఒకటి హైదరాబాదులోను, మరొకటి గుంటూరుజిల్లా బాపట్లలోను రెండు వ్యవసాయ కళాశాలలు స్థాపించబడినవి. ఈ కళాశాలలలో వ్యవసాయ శాస్త్రంలో డిగ్రీ కోర్సులకు శిక్షణ ఇవ్వబడుతున్నది. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో చేర్చబడిన వివిధ వ్యవసాయ పథకాలను అమలుపరచుటకు అవసరమయ్యే శిక్షితులైన సిబ్బందిని సమకూర్చుకొనే నిమిత్తం బాపట్ల కళాశాలలో విద్యార్థులను ఎక్కువగా చేర్చుకోవాలని సంకల్పించబడింది. ప్రతి సంవత్సరం బాపటలో యువకులైన వ్యవసాయదార్లకు 6 నెలల పాటు రిఫ్రెషర్ కోర్సులో శిక్షణ ఇవ్వబడుతున్నది. అభివృద్ధికరమైన వ్యవసాయ విధానాలను గురించి అనేక విషయాలు వాళ్లకు నేర్పబడుతున్నవి. అంతేకాక, రాష్ట్రంలోని డెవలప్‌మెంటు బ్లాకులలో అవసరమైన గ్రామ కార్యకర్తలను తరిఫీదు చేయుటకై బేసిక్ వ్యవసాయ పాఠశాలలు, ఎక్స్‌టెన్షన్ శిక్షణ కేంద్రాలు నిర్వహించబడుతున్నవి. బాపట్లలో పరిశోధనకు ప్రస్తుతంగల సౌకర్యాలు సరిపడినంతగా లేవు. అందువల్ల పరిశోధనకూ పోస్టు గ్రాడ్యుయేటు కోర్సులకూ అవసరమైన ఇతర సౌకర్యాలు అక్కడ కలిగించాలని నిశ్చయించబడింది.

## గ్రామీణ విశ్వవిద్యాలయం

ఇటీవల భారతదేశంలో గ్రామీణ విశ్వవిద్యాలయాలను స్థాపించే విషయం శ్రద్ధగా పరిశీలించబడుతున్నది. ఇటువంటి విశ్వవిద్యాలయాలు స్థాపించబడటానికి అవసరమైన సౌకర్యాలు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో పుష్కలంగా వున్నవి. ఉత్తరప్రదేశ్ రాష్ట్రప్రభుత్వం ఒక గ్రామీణ విశ్వవిద్యాలయాన్ని స్థాపించడానికి అనుకూలమైన పథకం తయారుచేయుటకు ఇలినాయ్స్ యూనివర్సిటీకి చెందిన డీన్ హెచ్. డబ్ల్యు. హనా అనే నిపుణుణ్ణి నియమించింది. ఆయన దృష్టిలో ఇటువంటి గ్రామీణ విశ్వవిద్యాలయాల ప్రయోజనం— 'బోధన, పరిశోధన, వ్యాప్తి కార్యక్రమం, ప్రజాసేవ, యీ ప్రక్రియలనుండి సహజంగా ఏర్పడే యితర కార్యకలాపాలను, సంస్కృతి, సేవ, శ్రమ, విద్యయొక్క నిజమైన ప్రయోజనాల యెడ శ్రద్ధ వగైరా సద్గుణాలు వికసించిన వాతావరణంలో నిర్వహించటానికి వీలైన ఒక సంస్థను ఏర్పరచి, దాని ద్వారా ప్రజలకు సేవచేయటం."

ఈ విశ్వవిద్యాలయ పరిధిలో వుండే కళాశాలలో వ్యవసాయ కళాశాల కూడా ఒకటైనప్పటికీ యీ కళాశాలకు ఒక ప్రత్యేకత వుంటుంది. విద్యార్థులకు కేవలం శాస్త్రబోధనే కాకుండా బాగా అభివృద్ధిచెందిన పరిశోధన కార్యక్రమం, వ్యవసాయవ్యాప్తి కార్యక్రమాలకు కూడా యీ కళాశాల బాధ్యత వహిస్తుంది. దీనికై ముఖ్యంగా కావలసినది ఆ నిపుణుని మాటలలో చెప్పాలంటే— "యావత్తు గ్రామీణ జనాభాకు యీ వ్యవసాయిక కళాశాల మార్గదర్శిగా పని చెయ్యాలి. గ్రామీణ అభివృద్ధి కార్యక్రమానికి నాయకత్వం వహించాలి."

హైదరాబాదులో లభిస్తున్న సౌకర్యాలతో ఇక్కడ ఒక గ్రామీణ విశ్వవిద్యాలయాన్ని ఏర్పాటు చేయడానికి అవకాశాలున్నవి.

## మార్కెటింగు

ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో లక్షించబడిన విధంగా వ్యవసాయోత్పత్తి అభివృద్ధిచెందినప్పుడు వుత్పత్తిని విడుదల చేయుటలోను, ధరలు పడిపోకుండా నిరోధించుటలోను, అధిక నిలువలు మొదలైన సమస్యలు పరిష్కరించుటలోను తోడ్పడుటకై సమర్థవంతమైన

మార్కెటింగు వ్యవసా నిర్మాణం జరుగవలసి వుంటుంది. తెలంగాణ ప్రాంతంలో మార్కెటింగు వ్యవస్థ బాగా అభివృద్ధి చెందింది. ఈ ప్రాంతంలో వివిధ వ్యవసాయ పంటలకు 39 మార్కెట్ యార్డులు పని చేస్తున్నవి. ఆంధ్రప్రాంతంలో నెల్లూరుజిల్లా వినా జిల్లా కొకటి చొప్పున 10 మార్కెట్ కమిటీలు ఉన్నవి. ముఖ్యమైన పంటలలో కొన్ని మాత్రమే వీటి ఆధ్వర్యంలో నిర్వహింపబడుతున్నవి. రాష్ట్రంలోని వ్యవసాయసంపద దృష్ట్యానూ, ఎక్కువగా మార్కెటింగు సౌకర్యాలుకల్పించవలసిన అవసరందృష్ట్యానూ పరిశీలిస్తే ముఖ్యంగా ఆంధ్రప్రాంతంలో ఇంకా ఎక్కువగా మార్కెటుయార్డులను ప్రారంభించి రైతుల సరుకుకు సక్రమమైన గిట్టుబాటు ధరలు లభించే ఏర్పాట్లు చేసి తద్వారా అధికోత్పత్తికి వారిలో ఉత్సాహాన్ని పెంపొందింపచేయవలసినఅవసరం ఎంతైనా వున్నది. దీనికి తోడు రైతులు తమ సరుకుకు గరిష్ఠమైన ధరలను పొందాలంటే మార్కెట్ సర్వేలు, సమాచారం, వ్యవసాయ వస్తువుల గ్రేడింగు మొదలైన విషయాలమీద కూడా శ్రద్ధగా పని చేయవలసి వుంటుంది. రాబోయే సంవత్సరాలలో ముఖ్యమైన కేంద్రాలలో నిలువ సౌకర్యాలు, రవాణా సౌకర్యాలు ఎక్కువగా కల్పించి మిగులు ప్రాంతాలనుండి వినియోగ కేంద్రాలకు సరకుల రవాణా వసతులను అభివృద్ధిచేయడానికి కూడా సంకల్పించబడింది.

ఇంతవరకు నేను సూచించిన విషయాలనుబట్టి ఇరిగేషన్ వసతులు పెంపొందించుకొనుట ద్వారాను, భూసార పరిరక్షణ చర్యలు, యంత్రాలతో వ్యవసాయం, అధునాతన వ్యవసాయ విధానాల అనుసరణ, పరిశోధనా కార్యక్రమాలను పటిష్ఠవంతంగా చేయుట, వ్యవసాయ విద్యాసంస్థలను ఎక్కువగా స్థాపించుట, పోస్టు గ్రాడ్యుయేటు విద్యాసౌకర్యాలను పెంపొందించుకొనుట, హైదరాబాదు సమీపంలో గ్రామీణ విశ్వవిద్యాలయ స్థాపన, వ్యవసాయ పంటల మార్కెటింగు వ్యవస్థ అభివృద్ధి మొదలైన విషయాల ద్వారానూ నూతనరాష్ట్రంలో వ్యవసాయాభివృద్ధి సాధ్యమవుతుందని స్పష్టపడుతున్నది. దేశ అవసరాల దృష్ట్యానూ, నూతన రాష్ట్రంలో సత్వర ఆర్థిక అభివృద్ధి సాధన దృష్ట్యానూ మన వ్యవసాయోత్పత్తిని అభివృద్ధిచేయుట చాలాఅవసరం. దీనికొరకై మనం తీవ్రంగా కృషిచేసి శాయశక్తులా ప్రయత్నించవలసి వుంటుంది. వుత్సాహవంతులైన వ్యవసాయదార్ల హృదయపూర్వక సహకారం లేనిదే యీలక్ష్యాన్ని ప్రభుత్వం ఒక్కటే సాధించలేదు. అందువల్ల సాధ్యమైనంత ఎక్కువ సహకారం ప్రభుత్వానికీ ప్రజలకూ మధ్య ఏర్పడవలసిన అవసరం ఎక్కువగా కలిగినటువంటి యీ సమస్య వ్యవసాయ రంగానికి సంబంధించినవారందరికీ ఒక సవాలువంటిది.

* * *



## మూసీ ప్రాజెక్టు

నీటమునిగిపొయ్యే గ్రామాలప్రజలు 1957 జూన్ నెల లోపుగా ఇతరప్రాంతాలకు తరలించబడుతారు. పాతగ్రామాలను సకాలంలో వదలివెళ్ళవలసిందిగా స్పెషల్ రెవిన్యూ ఆఫీసరు గ్రామప్రజలకు తెలియజేశాడు.

1957 జూన్‌నెల వరకల్లా రెండువైపులా 4,000 ఎకరాలకు నీరు వదలాలని తలపెట్టబడింది. 14 గ్రామాల అభివృద్ధిపనులు ప్రారంభమైనవి.

పంటలపథకంలో 1957 జూన్‌నెలవరకల్లా నీరు ఏగ్రామానికి వదలబడుతుందో ఆ గ్రామపటములో భూములతీరు, కాలువ నీటివల్ల సాగు అయ్యే మొత్తంభూమి, మొదలగు వివరాలు రంగులతో చూపబడినవి. ఈవిధంగా భూమి అర్హతను, క్రమమును, సాగునీటి తీవ్రతనుబట్టి వాస్తవంగా సాగు అయ్యే భూమి నిర్ధారణచేయబడింది.

[3 వ పేజీ తరువాయి]

| | | |
|---|---|---|
| | ఎకరాలు | గుంటలు |
| కాలువ వల్ల 14 గ్రామాలలో సాగు అయ్యే మొత్తం ప్రాంతం. | 14,233 | 21 |
| సాగునీరు లభింపజేయబడుటకు సిఫారసు చేయబడినప్రాంతం. | 8,144 | 26 |

మూసీ ప్రాజెక్టు పబ్లికు వర్క్సునుంచి అందిన పంట కాలువల సర్వే రిపోర్టు ప్రాతిపదికగా ఏయే గ్రామాలలో ఎంతప్రాంతంలో భూములలో మెట్టపైరులు వేయకుండా ఆ భూములను మాగాణి భూములుగా సిద్ధంచేయవలసిందీ ఒక ప్రకటనద్వారా తెలియజేయబడుతుంది.

వచ్చేజూన్‌నెలలో నీరువదలబడే 14 గ్రామాల వ్యవసాయ రెవిన్యూ సర్వే పూర్తిచేయబడింది. వ్యవసాయశాఖ భూములసర్వే జరుపుతుంది. ఎడమవైపున 27 గ్రామాలు, కుడివైపున 10 గ్రామాలు—మొత్తం 37 గ్రామాల సాంఘిక ఆర్థిక పరిశీలన పూర్తిచేయబడింది.

# పారిశ్రామికాభివృద్ధికి వాణిజ్య కృషి, శక్తి స్తోమతలు అవసరం

"పారిశ్రామికాభివృద్ధి కొరకై రెండవ పంచవర్ష ప్రణాళికలో కేటాయించబడిన ఖర్చులో కొంతభాగం రెవిన్యూ ఆధారాలనుంచే లభించవలసి వున్నది. కాబట్టి ప్రజలు నిర్దిష్ట మైన రూపంలో తమ కృషిని కేంద్రీకరించి, అవసరపు పన్నులు చెల్లించడంద్వారా ప్రణాళిక విజయానికి తోడ్పడాలి" అంటూ ఆంధ్రప్రదేశ్ గవర్నర్ శ్రీ చందూలాల్ త్రివేది 1957 జనవరి 1 వ తేదీన హైదరాబాదులో ఏడవ అఖిలభారత పారిశ్రామిక ప్రదర్శనానికి ప్రారంభోత్సవం చేస్తూ ప్రబోధం చేశారు.

హైదరాబాదునగరంలో ప్రతియేటా అఖిలభారత పారిశ్రామిక ప్రదర్శనం ఏర్పాటు చేయబడుతున్నది. ఈ సంవత్సరం ఆంధ్రప్రాంతంలోని అనేక పారిశ్రామిక వాణిజ్య సంస్థలు ఈ ప్రదర్శనంలో పాల్గొన్న కారణంగాను, ప్రతి రోజూ విశాలమైన ఈ రాష్ట్రంలోని నలుమూలలనుంచి అధికసంఖ్యలోవస్తున్న ప్రేక్షకుల మూలకంగానూ ఈయేడు ప్రదర్శనం చాలా శోభాయమానంగా వున్నది. ముఖ్యంగా అఖిలభారత చేతిపరిశ్రమలబోర్డువారు ఏర్పాటుచేసిన లోహ సామగ్రి ప్రదర్శనం ప్రత్యేకంగా చెప్పుకోదగింది. భారత దేశంలోని వివిధప్రాంతాలలో వివిధలోహములతో ఎటు వంటిపనితనంతో పాత్రసామగ్రి, ఇతరవస్తువులు తయారు చేయబడుతున్నాయో ఆ ప్రదర్శనం చక్కగా తెలియజేసింది. ప్రభుత్వశాఖలుకూడా తమ స్టాల్సును ఏర్పాటుచేసి నూతన రాష్ట్రంలో వివిధశాఖలు చేస్తున్న కృషిని వివరించాయి.




హైదరాబాదులో అఖిలభారత పారిశ్రామిక వస్తుప్రదర్శనంలో సమాచారశాఖ స్టాలు ముందరిభాగపు దృశ్యం



*ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి సమాచారశాఖ స్టాలులోని ఆంధ్రుల చరిత్రకు సంబంధించిన చిత్రపటాలను ఆసక్తితో పరిశీలిస్తున్న దృశ్యం*

రాష్ట్రంలోను, భారతదేశంలోని ఇతరప్రాంతాలలోను వున్నట్టి భారీపరిశ్రమలు, వివిధజిల్లాలోగల లఘుకుటీర పరిశ్రమలుకూడా ఈ ప్రదర్శనంలో పాల్గొన్నవి.

గవర్నరు తమప్రసంగంలో ప్రణాళిక విజయవంతం కావడానికి డబ్బే ప్రధానంకాదనీ, పట్టుదల కార్యదీక్ష ముఖ్యంగా కావాలనీ అన్నారు. ఉస్మానియా విశ్వవిద్యాలయ పట్టభద్రులు తలపెట్టిన ఒకానొక చిన్న ప్రయత్నం ఈనాడు ఇంతపెద్దఅఖిలభారతప్రదర్శనంగా ఫలించిందంటే ఉత్సాహం, కార్యదీక్షవల్ల ఎంతటిపనులు మనంచేయవచ్చో విదితమవుతున్నది అని అన్నారు. ఈ ప్రదర్శనం ఏ ఉద్దేశాలతో ఏర్పాటు చేయబడిందో ఆ ఉద్దేశాలు నెరవేరగలవని తామాశిస్తున్నట్లు చెప్పారు. భారతదేశపరిశ్రమలు ఏ వస్తువులను తయారుచేస్తున్నాయో ఈ ప్రదర్శనం ప్రజలకు తెలియజేసి కొంతసాంకేతిక విజ్ఞానాన్నికూడా వారికి కలుగజేయగలదని గవర్నరు అన్నారు.

గవర్నరు తమ ప్రసంగంలో ఇంకా ఇలా అన్నారు: "పూర్వపు హైదరాబాదు ప్రభుత్వం తెలంగాణాతోసహా మొత్తం హైదరాబాదురాష్ట్రంలో పరిశ్రమలను అభివృద్ధి పరచడానికి చాలా శ్రద్ధవహించింది. ఆంధ్రప్రదేశ్‌లో సిమెంటువంటి భారీపరిశ్రమలలోను, ఇతర లఘుపరిశ్రమలలోను ఉత్పత్తి బాగా హెచ్చగలదని ఆశిస్తున్నాను."

"పెద్దరకం పరిశ్రమలు, మధ్యరకం పరిశ్రమలు చాలా వరకు తమ వ్యవహారం తాము చూచుకోగలవు. అయితే వాటి యాజమాన్య ప్రమాణంమాత్రం ఉన్నతి జెందవలసిన అవసరం వుంటుంది. మరి చిన్నతరహా పరిశ్రమలకు అనేక అవరోధాలు, ఇబ్బందులు వున్నాయి. ఈ ఇబ్బందులను తొలగించడానికై రెండవపంచవర్షప్రణాళికలో అనేక ప్రతిపాదనలు చేయబడ్డవి. అందువల్ల అట్టి ఇబ్బందులన్నీ తొలగిపోగలవని నేను ఆశిస్తున్నాను." అని గవర్నర్ అన్నారు.

"ఈరాష్ట్రం ఇంకా త్వరితంగా పారిశ్రామికం కావడానికి మనం వత్తిడిచేయవలసివున్న"దని గవర్నరు అన్నారు. ఉదాహరణకు గనులత్రవ్వకానికి ప్రణాళికలో రూ. 73 కోట్లు కేటాయింపబడ్డవి. ఆంధ్రప్రదేశ్‌లో అపారమైన

సమాచారశాఖ స్టాలులో ఆంధ్రుల చరిత్రకు సంబంధించిన అనేక ఘట్టాలు సచిత్రంగా ప్రదర్శింపబడ్డవి







హైదరాబాదులో అఖిలభారత పారిశ్రామిక వస్తు ప్రదర్శనం ప్రారంభోత్సవం సందర్భంలో
డాక్టర్ బి. యస్. మేల్కోటే రాష్ట్ర గవర్నరుకు స్వాగతం చెప్తున్నారు



పారిశ్రామిక వస్తు ప్రదర్శనమును వీక్షిస్తున్న రాష్ట్ర ముఖ్యమంత్రి



ఖనిజసంపద వున్నది. ఈ ఖనిజసంపదను త్రవ్వి తీయవలెనని మనం వత్తిడి చెయ్యాలి. స్పష్టంగావున్న విషయాలను ఒకటికి రెండుమార్లు చెప్పుకుంటే పైవారు తప్పకుండా వింటారని గవర్నర్ అన్నారు.

"కొన్ని ప్రాజెక్టులు సక్రమంగా వుండవలసినచోట్లలేవు. ఈ విషయాన్ని మనం పైవారిదృష్టికి తేవలసివున్నది. సింగరేణిలో లోటెంపరేచర్ కార్బొనైజేషన్ యంత్రాగారం నెలకొల్పడం అవసరమన్న విషయం సబబైనదని అంతా అంగీకరించారు. అలాగే విశాఖపట్నంలో భారీ డీజెల్ ఇంజన్ యంత్రశాలకూడా. మరి ఒక ఉక్కు ఫ్యాక్టరీ కూడానెలకొల్పాలని మనం కోరుతున్నాము. ప్రస్తుతమైతే ఈ రాష్ట్రంలో ముడిఇనుము అంతగాలేదు. అయితే పశ్చిమ గోదావరి జిల్లాలో భూగర్భంలో ముడిఇనుము బాగా లభించవచ్చుని తెలుస్తున్నది. మూడో ప్రణాళికలోనో, నాల్గవ ప్రణాళికలోనో ఆంధ్రప్రదేశ్‌కు ఒక ఉక్కు ఫ్యాక్టరీ నెలకొల్పబడటం తథ్యం. అయితే దానికి ఇప్పటినుంచే వత్తిడిచేస్తూ పోవాలి. మధ్య ప్రదేశ్‌లో ఉక్కు ఫ్యాక్టరీ స్థాపించబడాలనే ఆలోచన 1925 లోనే కలిగింది. అది ఇప్పుడు కార్యరూపం దాలుస్తున్నది."

"ఆంధ్రప్రదేశ్‌కు రసాయనిక ఎరువుల ఫ్యాక్టరీకూడా ఒకటి ఏర్పడాలి. దానికి రెండవ ప్రణాళిక కాలంలోనే కొంత ప్రయత్నం జరిగితే కనీసం మూడవ ప్రణాళికలోనైనా అది సఫలం కావచ్చు."

భారతదేశం మొత్తంలో 20 చిన్న పరిశ్రమల యూనిట్లు స్థాపింపబడ సున్నవి. వాటిలో ఆంధ్రప్రదేశ్‌కు కనీసం రెండైనా రావాలి, అని గవర్నరు అన్నారు.

రాష్ట్రాన్ని పారిశ్రామికంచేసే విషయంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కడుశ్రద్ధాసక్తులు కలిగివున్నదని గవర్నరు తెలిపారు. పరిశ్రమల శాఖను ఇంకా బలపరచవలసివున్నది. కొంత వ్యాపారప్రయత్నంకూడా వుండాలి. శక్తిస్తోమతలు కావాలి. పరిశ్రమలు అభివృద్ధిచెందితే మనం ఆర్థికంగా పురోగమిస్తాము. మన జీవిత ప్రమాణాలు పెరుగుతాయి. సామాన్య మానవులతోసహా దేశప్రజలంతా సిరిసంపదలు అనుభవిస్తారు, అని గవర్నరు తమ ప్రసంగంలో ఉద్బోధించారు.

గవర్నరు ప్రదర్శనానికి ప్రారంభోత్సవం చేయడానికి ముందు ప్రదర్శన సంఘం అధ్యక్షులు డాక్టర్ జి. యస్. మేల్కోటే వారికి స్వాగతం చెబుతూ పారిశ్రామిక ప్రదర్శనం చరిత్రను, ఆయేటికాయేడు అది పొందుతూవచ్చిన అభివృద్ధిని, దాని ప్రత్యేకతలను వివరించారు. ప్రదర్శన సంఘం అనతికాలంలో అంతర్జాతీయ వాణిజ్య పరిశ్రమల ప్రదర్శనాన్ని ఏర్పాటుచేయ సంకల్పించిందనీ, దానికి పెద్ద స్థలం, సక్రమమైనప్లాను, ఆర్థికస్తోమత అవసరమనీ అవి అన్నీ లభించడానికి తాము ప్రభుత్వంపైనే దృష్టిపెట్టుకొని వున్నామనీ శ్రీ మేల్కోటే తెలియజేశారు.

# హిందూస్థాన్ నౌకా నిర్మాణశాల

విశాఖపట్నంలోని హిందూస్థాన్ నౌకా నిర్మాణశాల భారతదేశానికి అమూల్యమైన ఆస్తిగా పరిగణించ దగిన కేంద్రం. దేశం మొత్తంలో ఇక్కడ ఒక్కచోట మాత్రమే నౌకలు నిర్మింపబడుతున్నవి. ఈ నౌకా నిర్మాణాలశాల ఒకానొక ప్రయివేటు పారిశ్రామికుని ఆలోచనవల్ల కార్యదక్షతవల్ల నెలకొల్పబడినప్పటికీ ఇది అనేక ఒడుదుడుకులకు తట్టుకొని నిల్చి స్థిరమైన అభివృద్ధిని పొందినది. ఇప్పు డిది కేంద్రప్రభుత్వ అజమాయిషీక్రింద వున్నది. రెండవ పంచవర్ష ప్రణాళికలో దీనిని విస్తృతపరచి ఇతోధికంగా అభివృద్ధి పరచడానికై రూ. 902.8 లక్షలు కేటాయించబడ్డవి.

ఈ నౌకా నిర్మాణశాల కారొమాండల్ తీరముపై కలకత్తా మద్రాసు నగరాలకు దాదాపు మధ్యన ప్రకృతి సిద్ధమయిన విశాఖపట్నం ఓడరేవుకు ఆగ్నేయదిశన వున్నది.

ఈ నౌకా నిర్మాణశాలకు 1941 లో అప్పుడు భారత జాతీయ కాంగ్రెసు అధ్యక్షులుగా వున్నట్టి డా. రాజేంద్ర ప్రసాద్ శంకుస్థాపనచేశారు. దీని నిర్మాణానికి పూనుకున్నది సింధియా స్టీమ్ నేవిగేషన్ కంపెనీ లిమిటెడ్ వారు. ఈ కంపెనీవారు అనేక యిబ్బందులను ఎదుర్కొని 1946 లో రెండు బెర్తుల (స్థానములు)తో నౌకా నిర్మాణశాలయొక్క ప్రథమదశ నిర్మాణాన్ని పూర్తిచేశారు. అదే సంవత్సరం ఓడల నిర్మాణం ప్రారంభింపబడింది. ప్రధానమంత్రి పండిత జవహరలాలు నెహ్రూ 1948 మార్చి 14 వతేదీన యస్. యస్. జల ఉష అనే నౌకకు జల ప్రవేశోత్సవాన్ని జరిపారు.

## కొత్త కంపెనీ

మనదేశంలో నౌకానిర్మాణ పరిశ్రమకు జాతీయ ప్రాముఖ్యం వున్నందుచేత విశాఖపట్నం నౌకానిర్మాణశాలలో భారత ప్రభుత్వం పెద్ద భాగస్వామ్యాన్ని స్వీకరించింది. హిందూస్థాన్ షిప్‌యార్డు లిమిటెడ్ అనే పేరుతో ఒక ప్రయివేటు లిమిటెడ్ కంపెనీ స్థాపించబడి 1952 జనవరి 21 వ తేదీన ఢిల్లీలో రిజిస్టరు చేయబడింది. ఈ కంపెనీలో భారత ప్రభుత్వానికి మూడింట రెండువంతుల వాటాలున్నవి. మిగిలిన మూడోవంతు వాటాలు సింధియా స్టీమ్ నేవిగేషన్ కంపెనీ లిమిటెడ్ వారివి. కొత్త కంపెనీ 1952 మార్చి 1 వ తేదీన నౌకా నిర్మాణశాల యాజమాన్యాన్ని స్వీకరించింది.

ఒకనౌకను నిర్మించాలంటే మొదట డిజైనులు తయారుచేయబడుతాయి. స్వరూపము నిర్ణయించబడుతుంది. నౌకానిర్మాణం ఎలా జరగాలి, ఏ భాగంలో ఏవేవి వుండాలి అన్న అంశాలు తేల్చబడుతవి. అవసరమైతే డిజైనులను నైపుణ్యానికి ఏర్పడసిన ప్రయోగశాలకు పంపుతారు. అక్కడ నౌక వేగం ఎంతవుండాలని ప్రతిపాదించబడిందో ఆవేగానికి కావలసిన శక్తి మొదలయినవి పరిశీలింపబడుతాయి. నౌకా నిర్మాణానికి సంబంధించిన డిజైనులు ఆమోదంకొరకై లండన్‌లోని లాయడ్స్ రిజిస్టర్ ఆఫ్ షిప్పింగు అను సంస్థకు పంపబడుతవి. ఆమోదింపబడిన డిజైనులలోనుంచి ప్రతి నౌకకు దాదాపు 800 వర్కింగు ప్లానులు సవివరంగా తయారుచేయబడుతవి. ఈ ప్లానులలోనుంచి ఉక్కుప్లేట్లు, కోణములు, కలప, చిల్లర ఫిట్టింగులు మొదలయినవి కచ్చితంగా ఎన్నికావాలో తేల్చుకోబడుతాయి.

డ్రాయింగు ఆఫీసులో తయారుచేయబడిన ప్లానులు మౌల్డు లాఫ్టుకు పంపబడుతవి. అక్కడ నౌక పూర్తి



*విశాఖపట్నంలోని హిందూస్థాన్ నౌకా నిర్మాణశాల తాలూకు పరిపాలన, డిజైనింగ్, డ్రాయింగు కార్యాలయాలు ఇవి సూనమెట్ట కొండమీద వున్నవి. ఇక్కడనుంచిచూస్తే మొత్తం నౌకానిర్మాణశాల చక్కగా కన్పిస్తుంది.*

పరిమాణంలో అమర్చబడుతుంది. టెంప్లేట్లు తయారు చేయబడుతవి. వివిధమయిన ఆకారములుగల ఉక్కు సామానులు ఒకదాని కొకటి అమరేటట్లు ఉండాలి. ఆ విధంగా అమరేటట్లు వుండడానికై మొదట కొయ్యతో పూర్తిసైజు నమూనాలు తయారుచేయబడుతాయి. అట్టి నమూనాను టెంప్లేటు అంటారు. ఇటువంటి టెంప్లేట్లు ఓడయొక్క ప్రతిభాగానికీ తయారుచేయబడుతాయి. ఇవి సమమయిన కొయ్యముక్కలతో తయారుచేయబడి, ఉక్కుముక్కలు ఏ ఆకారములో ఎంత వెడల్పుగా హల్ షాపులో పోతపోయబడవలెనో చూపించేటట్లుగా ఒకదాని కొకటి జంటచేయబడి, బిల్డింగ్ బెర్తుపై నిలుపబడుతాయి. టెంప్లేట్లపై రివెట్ రంధ్రాలు, కోతలు, కోణముల కొలతలు మొదలగునవి గుర్తుపెట్టబడుతాయి. ఆ విధంగా గుర్తుపెట్టడమువల్ల ఆ గుర్తులనుబట్టి ఉక్కుసామాగ్రిని అమర్చడానికి వీలుపడుతుంది.

ఆ తరువాత నిర్మాణానికి సంబంధించిన రెండవ దశ హల్‌షాపులో మొదలవుతుంది. అక్కడ ఉక్కు పోతపోయబడుతుంది. హల్‌షాపులో 70×338 అడుగుల విస్తీర్ణపు 4 విభాగాలుంటాయి. ఇందులోపంచింగ్, ప్లేట్ బెండింగు, షియరింగ్ మిషనులు వుంటాయి. వాటిపైన ఎటుపడితే అటు తిరిగే క్రేన్ యంత్రాలుంటాయి. హల్‌షాపు ఏడాదికి దాదాపు 10,000 టన్నుల ఉక్కుసామగ్రిని పోతపోస్తుంది.

పోతపోయబడినట్టి ఉక్కుసామాగ్రి హల్‌షాపు నుంచి నౌక నిర్మింపబడు బెర్తులవద్దకు తేబడుతుంది. ఈ నౌకా నిర్మాణశాలలో 550, 550, 500 అడుగుల నిడివిగల బెర్తులు మూడువున్నవి. వీటిలో రెండు బెర్తులకు 5 టన్నుల మానోటవర్ క్రేను లున్నవి. మూడవబెర్తుకు 35 టన్నుల హామర్ హెడ్ ట్రావెలింగ్ క్రేన్‌వున్నది. ఎటుపడితే అటుతిరిగే ఈ క్రేన్ ఇటీవలనే పెట్టబడింది. నౌక నిర్మింపబడటం పూర్తి

అయినతరువాత దానికి జల ప్రవేశం జరిగేవరకూ నామకరణం చేయబడదు. నిర్మాణంలో ఉన్నప్పుడు దానిని నిర్ణీత సంఖ్యతో వ్యవహరిస్తూవుంటారు.

## గాలితాకిడికి రక్షణ

నౌకా నిర్మాణశాల వున్నటువంటి జలసంధి సముద్రపు ఆటుపోటులులేకుండా ఏ ఋతువులోనయినా నౌకలను సముద్ర ప్రవేశం చేయించడానికి మిక్కిలి అనుకూలంగావున్నది. నౌకా నిర్మాణశాలచుట్టూ కొండలున్నవి. కనుక గాలితాకిడి లేకుండా మంచి రక్షణ కూడా కలదు.

నౌకను జల ప్రవేశం చేయించేటప్పుడు స్లయిడింగ్ మార్గం గ్రౌండుమార్గంమధ్య కొవ్వు, మెత్తటి సబ్బు, అరటికాయల మిశ్రమంతో దట్టమయిన పొర వేయబడుతుంది. ఒకనౌకను జల ప్రవేశం చేయించడానికి దాదాపు 3,000 అరటికాయలు ఉపయోగించబడుతాయి. విశాఖపట్నంలోని ఉష్ణోగ్రతవల్ల కొవ్వు కరిగిపోతుందికాబట్టి ఆ కొవ్వుకు అవసరమయిన రక్షణ కల్పించడానికి అరటికాయలను ఉపయోగించవలసిన అవసరం ఏర్పడుతున్నది.

నౌకను జల ప్రవేశం చేయించినతరువాత దానిని ఫిట్టింగ్ ఔట్ జెట్టీవద్దకు గొనిపోవడమౌతుంది. అక్కడ ఇంజన్ ఫిట్ చేయబడి, కొయ్యపని జరుపబడుతుంది. జెట్టీ 1200 అడుగుల పొడవు ఉంటుంది. దానికి మిషన్ షాపు, పంచింగ్ షాపు, కొయ్యపని షాపు వుంటాయి. జెట్టీవద్ద 125 టన్నుల క్రేను నెలకొల్పబడుతున్నది.

నౌకా నిర్మాణశాలలో నిర్మింపబడు నౌకలు 60 శాతం వెల్డింగు, 40 శాతం రివిటింగ్ చేయబడుతాయి. 35 టన్నులవరకు పెద్ద యూనిట్లను పోతపోయడం ద్వారా ఉత్పత్తిని హెచ్చించడానికై పెద్ద పోత విభాగాన్ని నిర్మించడానికి తలపెట్టబడింది.

నౌకా నిర్మాణ పరిశ్రమను అభివృద్ధి పరచడానికై భారత ప్రభుత్వం ప్రథమ పంచవర్ష ప్రణాళికలో రూ. 14,08,60,000 లు కేటాయించింది. దీని అభివృద్ధి పథకంలో ఎక్కువ బెర్తుల నిర్మాణం, హల్



*నౌకా నిర్మాణశాలలో ఫిట్టింగ్ ఔట్ జెట్టీ దృశ్యం*

# వార్తాచిత్రాలు



15-1-1957 తేదీన చేతిపరిశ్రమల సప్తాహ ప్రారంభోత్సవం



హైదరాబాదులోని ఎగ్జిబిషన్ థియేటర్‌లో కుమారి సుమిత్రచే ప్రదర్శింపబడిన "ఆంధ్రదేశ నాట్యసంప్రదాయాలు" అనే ప్రదర్శనానికి రాష్ట్ర గవర్నరు అధ్యక్షతవహించారు.



కుమారి సుమిత్ర నాట్య భంగిమ



16-1-1957 తేదీన మ. ఘ. వ. నిజాం గౌరవార్థం రాజ్ భవన్‌లో ఏర్పాటుచేయబడిన విందు దృశ్యం



17-1-1957 తేదీన హైదరాబాదులోని మహిళా కళాశాల [illegible] హాలులో [illegible]
దినోత్సవం సందర్భంలో ప్రసంగిస్తున్న రాష్ట్రమంత్రి నవాబ్ మెహదీ నవాజ్ జంగ్



హైదరాబాదులో 13-1-1957 [illegible] ంధ్రప్రదేశ్ రైఫిల్ ఏసో[illegible] ప్రథమ ఛాంపియన్‌షిప్
పోటీలలో గెలుపొ[illegible]కి రాష్ట్రగవర్నరు బహుమతి ప్రదానంచేస్తున్నారు



10-1-1957 తే[illegible] ర్ డివిజన్ యన్. సి. సి. బాలికల విభాగంయొక్క
వార్షి[illegible] బిరానికి శ్రీమతి కుసుం త్రివేదీ ప్రారంభోత్సవంచేశారు



భారత[illegible] యం. శ్రీ నగేష్ ఇటీవల హైద్రాబాదు విచ్చేసి తిరిగి వెళ్లుతున్న సందర్భంలో
బేగంపేటలో మిలిటరీ అధికారుల[illegible] వు పుచ్చుకుంటున్న దృశ్యం

# సామాజికాభివృద్ధి గమనం

శ్రీ సి. నరసింహం, ఐ. ఏ. యస్.
*అడిషనల్ డెవలప్‌మెంటు కమీషనర్, ఆంధ్రప్రదేశ్.*

1952 అక్టోబరులో యావద్భారత దేశంలో పైలట్ పథకాలుగా కమ్యూనిటీ ప్రాజెక్టుల ఉద్యమం ప్రారంభమైనది. స్థానిక ప్రజల స్వయంకృషి ద్వారా జాతీయ సాంఘికాభ్యుదయ సాధన యీ ఉద్యమం లక్ష్యం. ప్రజలనుండివచ్చే సహకారం, వారుచూపే ఉత్సాహం ప్రాతిపదికలుగా, జాతి మొత్తానికి సాంఘిక, ఆర్థిక అభివృద్ధి ఫలితాలు లభించేటట్లుగా కమ్యూనిటీ ప్రాజెక్టుల కార్యక్రమం రూపొందించబడింది. తమ అభివృద్ధిని సాధించుకునే కృషిద్వారా జాతీయాభివృద్ధి కార్యక్రమాలకు ప్రజలు స్వయంగాతోడ్పడడం యీ ఉద్యమంయొక్క ప్రత్యేకలక్షణం. ఈకృషిలో జాతీయాభివృద్ధి విస్తరణోద్యమాలకు చక్కని సమన్వయం సాధించబడింది. ఈఉద్యమం జాతీయ, ఆర్థిక అభ్యున్నతి సాధన కృషిలో శాశ్వతమైన ఒక పరిపాలనావ్యవస్థగా రూపొందింది.

ఇటువంటి మహోద్యమం మన ఆంధ్రప్రదేశ్‌లో ఎంతవరకు కొనసాగిందో పరిశీలిద్దాం. ఒక ఉద్యమాన్ని సమీక్షించేటప్పుడు దాని లక్ష్యాలను మనం గుర్తుంచుకోవాలి. గ్రామీణులలో అభివృద్ధికరమయిన దృక్పథాన్ని పెంపొందించడం, వారిని సహకారకృషికి సుముఖులుగా చేయటం, అధికోత్పత్తి సాధన, జీవనోపాధి అవకాశాల విస్తృతీకరణ లక్ష్యాలుగా మొదట్లో యీ ఉద్యమం ప్రారంభింపబడింది.

## శీఘ్రగతిని ప్రగతి

ఆంధ్రప్రదేశ్ ప్రాంతంలో 1952 లో నాలుగు కమ్యూనిటీ ప్రాజెక్టులు మాత్రమే ఉండేవి. అందులో ఒకటి చాలా చిన్నదికూడా. అప్పుడు యీ ఉద్యమం 887 గ్రామాలకు వ్యాపించి, 2,792 చ. మైళ్ళలోని 14.57 లక్షల ప్రజానీకానికి సేవచేస్తుండేది. తరువాత నాలుగు సంవత్సరాల స్వల్ప వ్యవధిలో మన ఉద్యమం రాష్ట్రంలోని నాల్గవవంతు భూభాగానికి వ్యాపించింది. ప్రస్తుతం యీ కార్యక్రమాలు 8,550 గ్రామాలకు వ్యాపించి 29,506 చ. మైళ్ళలో సుమారు 93 లక్షల జనాభాకు వర్తించి కొనసాగుతున్నవి. కేవలం విస్తృతివల్లనే ఒక ఉద్యమం మంచిచెడులను నిర్ణయించలేము. అయినా నిష్పక్షపాతంగాచూస్తే, త్వరితగతిలో సాధ్యమయిన యీ పురోగమనమే ఉద్యమ విజయానికి సూచనగా అంగీకరించక తప్పదు.

ఈ ఉద్యమం కొనసాగిన కాలంలో అధికోత్పత్తి సాధన నిమిత్తం 10 లక్షల మణుగుల మేలురకం విత్తనాలు 36 లక్షల మణుగుల ఎరువులు, రాష్ట్రంలోని సమాజ వికాసకేంద్రాల ప్రాంతాలలో పంచబడినవి. 3,900 మేలు జాతి పశువులు గ్రామస్థులకు అందజేయబడినవి. ఈస్వల్ప కాలంలో త్రవ్వబడిన మంచినీటిబావులసంఖ్య 3,543. గ్రామ సీమలలో 1,203 మైళ్ళు పక్కారోడ్లు, 2,272 మైళ్ళ పొడవున కచ్చారోడ్లు నిర్మించటం జరిగింది. క్షీణదశలో వున్న వివిధరకాలయిన చేతివృత్తులను పునరుద్ధరించడానికై 104 ప్రదర్శన - శిక్షణకేంద్రాలలో 1,200 మందికి శిక్షణ ఇవ్వబడింది. గ్రామీణ ప్రాంతాలలో ఇంతకు పూర్వము కంటె ఇప్పుడు ఎక్కువగా జీవనోపాధికి అవకాశాలు కలిగినవని చెప్పవచ్చు. ఇటీవల నేషనల్ శాంపిల్ సర్వే ద్వారా లభించిన పంటల అంచనాలనుబట్టి సమాజ వికాస కేంద్రాల ప్రాంతాలలో ఇతర ప్రాంతాలకంటె 25 శాతం అధికోత్పత్తి జరుగుతున్నట్లు వెల్లడి అయింది. కాగా, యీ ఉద్యమ ప్రధాన లక్ష్యాలయిన అధికోత్పత్తి, అధిక వృత్తి



*భారత ప్రభుత్వ సామాజికాభివృద్ధి మంత్రి శ్రీ యస్. కె. డే. 9-1-1957 తేదీన షాద్‌నగర్ తాలూకాలోని బాలానగర్‌లో గ్రామమందిరానికి ప్రారంభోత్సవంచేస్తున్న దృశ్యం*

కల్పన కార్యక్రమాలు, సామాజిక వికాస కేంద్రాలద్వారా విజయవంతమవుతున్నట్లు స్పష్టమవుతున్నది.

సామాజిక వికాసోద్యమం వ్యాపించిన ప్రాంతాల్లో సహకార కృషి చైతన్యం ఎంతవరకు అభివృద్ధి పొందిందో పరిశీలిద్దాం. ఈ రంగంలో సాధించబడిన విజయాలుకూడా ప్రోత్సాహకరంగానే ఉన్నవి. 1,200 క్రొత్త సహకార సంఘాలలో 2.25 లక్షల సభ్యత్వం సమీకరించబడినవి. సహకారోద్యమ కృషిలో ఆదర్శగ్రామాలు సైతం వెలుస్తున్నవి. ప్రతికుటుంబం ఏదోఒక సంఘంలో సభ్యత్వం వహించాలనే మన లక్ష్యసిద్ధివైపుకు ఉద్యమం శీఘ్రగతిలో పురోగమిస్తున్న దనడానికి యిదే నిదర్శనం. వచ్చే పది సంవత్సరాలకాలంలో నిస్సందేహంగా మనం గమ్యాన్ని చేరుకోగలం.

## ప్రజా సహకారం

జాతీయాభివృద్ధికి జాతీయకృషి అవసరమనే విషయాన్ని ప్రజానీకం గుర్తించింది. వారి భావనారీతిలో క్రొత్తదనం తొణికిసలాడుతున్నది. ధన, వస్తు, శ్రమరూపాలలో యీ ప్రాంతాలలో ప్రజలనుండి రు. 220 లక్షల విలువగల సహకారం లభించటమే ఇందుకు తార్కాణం. ధన వస్తురూపాలలో సహకరించలేని గ్రామీణులలో శ్రమదానం ఒక ఉద్యమంలాగా వ్యాపించింది. భారత సేవకసమాజ్ వంటి ఐచ్ఛికోద్యమాలద్వారా విద్యార్థులు, ఇతర సంస్థలు, గ్రామీణ ప్రజానీకానికి క్రొత్తచైతన్యాన్ని కల్పించుటలో ముందంజవేస్తున్నవి.

ప్రత్యక్షంగానో, పరోక్షంగానో యీ ఉద్యమ కార్యక్రమ నిర్వహణతో సంబంధం ఉన్నవారు, దాని ఫలితాలను సమీక్షించటం కొంతవరకు కష్టమే. అంతేగాక వారికి ఉద్యమకృషిలో జరుగుతున్న లోపాలను, వాటి నివారణకు తీసుకోవలసిన చర్యలనుగురించికూడా తెలుసుకోవటము కష్టమే కావచ్చు. అందువల్ల కార్యక్రమ ఫలితాలను సవిమర్శకంగా పరీక్షించే బాధ్యత, కార్యక్రమ ఫలితాల పరిశీలనా సంస్థ అనేఒక స్వతంత్రసంస్థకు అప్పగించబడింది. ఈ సంస్థ విమర్శక దృష్టితో కార్యక్రమాలను మదింపు

వేస్తుంది. గడచిన మూడు సంవత్సరాల్లో, సమాజ వికాసోద్యమం అధికారులలోనూ, గ్రామీణ ప్రజానీకంలోనూ కలిగించిన నూతన దృక్పథమే అది సాధించిన ఘన విజయమని యీ సంస్థ పేర్కొనటం గమనార్హం.

అంతేకాక సమాజ వికాస కార్యక్రమాల్లో నిపుణులు, సుప్రసిద్ధులయిన, విల్సన్, కార్ల్ టేలర్ వంటి అనుభవజ్ఞుల అభిప్రాయాలు మనకు లభించినవి. వీరుభయులు, సమాజాభివృద్ధి కార్యక్రమాలమీద ఫోర్డు ఫౌండేషన్ సలహాదార్లు. కార్యక్రమంలోగల కొన్ని అంశాలపై మనం సర్దుబాట్లు చేసుకోటానికి ప్రయత్నిస్తున్నాము. ఆ అంశాలను గురించి యీ నిపుణులు మనకు సలహా యివ్వదగిన విషయాలు కొన్ని వున్నప్పటికీ, దేశం మొత్తంమీద యీ ఉద్యమ పురోగమనం దృష్ట్యా, అది అభివృద్ధి చెందుతున్నదని వారుకూడా అంగీకరిస్తారు. విల్సన్ ఏమంటాడో చూడండి.

“ఈ ఉద్యమం దాని విస్తృతి, నిర్వహణ వ్యవస్థ, దాని లక్ష్యాలు, ఇవన్నీ మొత్తంమీద చూస్తే నేను దీనిని ప్రశంసించకుండా ఉండలేను. అనేక విషయాలలో యీ మహోద్యమంతో పోల్చదగినది గ్రామీణ అభ్యున్నతి. వయోజన విద్యారంగాలకు సంబంధించిన ప్రపంచ చరిత్రలో ఇంకెక్కడా కనుపించదు.”

భారతదేశంలో సమాజ వికాసోద్యమ కార్యక్రమాలను సమీక్షిస్తూ టెయిలర్ కూడా యీ ఉద్యమం విజయం పొందిందని పేర్కొన్నాడు. ఈ విషయంలో టేలర్ అభిప్రాయాలు చూడండి. “స్వరాజ్యం వచ్చినప్పుడు, భారతీయ గ్రామసీమల్లో మానసికంగా, భౌతికంగా, ఆర్థికంగా, సాంస్కృతికంగా ఒకవిధమైన జడత్వం ఆవరించివున్నమాట నిజమే. కాని నూతన పరిణామానికి అవరోధంగా నిలిచిన యీ జడత్వం అనతికాలంలోనే అనేక రంగాలలో నిర్మూలించబడింది. ఇప్పటి విజయవంతంగా నిర్వహింపబడిన సమాజవికాస కార్యక్రమాల ప్రభావం భారతదేశం నలుమూలలకు ప్రాకి, యీ ఉద్యమం అతి శీఘ్రంగా దేశమంతటా వ్యాపిస్తుంది. ఈ కార్యక్రమాల సాంకేతిక నిర్వహణ శాఖలు అందుకోలేనంత అతిత్వరితగతిలో యీ ఉద్యమం దేశంలో వ్యాపిస్తుంది.



శ్రీ యస్. కె. డే. బూర్గుల గ్రామంలో చర్మకార పరిశ్రమను పరిశీలిస్తున్నారు



*షాద్‌నగర్ తాలూకాలోని పాపిరెడ్డిగూడెంలో 9-1-1957 తేదీన భారత ప్రభుత్వ సామాజికాభివృద్ధి మంత్రి శ్రీ యస్. కె. డే. గ్రామనాయకుల శిక్షణ శిబిరానికీ, ఉపాధ్యాయుల వృత్తి పనుల శిక్షణ కేంద్రానికీ ప్రారంభోత్సవంచేసిన సందర్భంలో ప్రసంగిస్తున్న దృశ్యం*

ప్రజానీకం కదిలింది, వారిలో ఉత్సాహం ఉప్పొంగుతున్నది. స్తబ్ధత నశించింది. జడత్వమనే మహాపర్వతం కరిగింది. చైతన్యం స్రవంతిలా కదిలింది. జాతీయవికాస, జాతీయ విస్తరణోద్యమాల ద్వారా గ్రామ సీమలలో నూతనోత్సాహం వెల్లివిరిసింది. నవభారత నిర్మాణదీక్ష గ్రామీణ ప్రజానీకంలో పెల్లుబుకుతున్నది, అని 1956 ఫిబ్రవరిలో అమృతసర్ కాంగ్రెస్‌లో మన ప్రధానమంత్రి పేర్కొన్నారు.

మన ప్రధానమంత్రి, నిష్పక్షపాతులైన ఇతర నిపుణులు చేసిన ప్రశంసలు పొందటానికి యీ ఉద్యమానికి అర్హత ఉన్నది. కాని అవి మందగమనానికి మార్గాలు కారాదు. ఈ ప్రశంసల పూలహారాలతో మనం సంతృప్తిపడి ఊరుకోకూడదు. ఇటువంటి మహోద్యమాన్ని చాలా జాగ్రత్తతో నిర్వహించాలి. ఎప్పటికప్పుడు లోపాలను సమీక్షించుకోవాలి. ఫలితాలను యదార్థ దృష్టితో పరిశీలించాలి. ఉద్యమానికి కాలానుగుణ్యంగా అవసరమైన మార్పులు చేసుకోవాలి, రాజాజీ సలహా చూడండి. "మనం చక్కగా ఆలోచించి చేయవలసింది ఇంకా చాలా ఉంది. మానవుని ఆనందం లక్ష్యసిద్ధిలో లేదు. దానికొరకు శ్రమించటంలోనూ, బాధపడటంలోనూ అతడు అంతులేని ఆనందాన్ని అనుభవిస్తాడు." అన్నాడు రాజాజీ.

మన అంతిమ లక్ష్యమైన సోషలిస్టు సమాజ వ్యవస్థా నిర్మాణకృషిలో విజయసిద్ధికై అందరూ యథాశక్తి సహకరించాలని విజ్ఞప్తి చేస్తున్నాను.



ఆంధ్రప్రదేశ్ లో దర్శనీయమైన స్థలాలు :

# అన్నవరపు శ్రీ సత్యనారాయణస్వామి దేవాలయం



మద్రాసు - కలకత్తా మార్గంలో రాజమండ్రికి సమీపంలోగల అన్నవరం ఆంధ్రదేశంలో మిక్కిలి పవిత్రమైన ప్రదేశాలలో ఒకటి. ఇక్కడికి ప్రతిసంవత్సరం వేలాది యాత్రికులు వస్తారు. అయితే దీనినిగురించి దేశంలోని యితర ప్రాంతాలవారికి అంతగా తెలియదు. గ్రాండు ట్రంకు రోడ్డు 413 వ మైలులో రైలుస్టేషనుకి దాదాపు రెండు మైళ్ల దూరంలోవున్న 'రత్నగిరి' కొండ తూర్పు వైపున యీ దేవాలయం నిర్మించబడినది. ఇది రమ్యమైన ప్రదేశంలో వుంది. ఇక్కడికి వెళ్లడం సులభం. అన్నిటినీమించి ఇది పరమపావనమైనది. అందుచేత యిక్కడికి బహుళ సంఖ్యలో భక్తులువస్తారు. తూర్పు, పశ్చిమ గోదావరులు, విశాఖపట్నం, కృష్ణా, శ్రీకాకుళం జిల్లాల్లో శ్రీ సత్యనారాయణస్వామి గృహదైవతము.

ఈ దేవాలయాన్ని చేరుకొనడానికి చక్కగా తీర్చబడిన 400 మెట్లు వున్నాయి. కొండమొదటవున్న ఒక చిన్న గుడిలో కనకదుర్గ వున్నది. కొండ మధ్యభాగంలో వన దుర్గ దేవాలయం వున్నది. ఈమె ఆ ప్రదేశానికి స్థలదేవత. నాలుగుచేతులుగల ఈదేవీ విగ్రహాలు రెండూ సుందరమైన శిల్పంలో సాత్వికస్వరూపంలో మలచబడినవి. పైరెండు చేతులలోను విష్ణు చిహ్నాలు వున్నాయి. కుడివైపు క్రింది చేతిలో ఖడ్గం వుంది. మరొకచెయ్యి అభయహస్త మిస్తున్నది. అసలు గుడికికొంచెం దిగువగా సీతారాముల దేవాలయంవుంది. లక్ష్మీనారాయణులలోవలెనే సీత రాముని తొడపై కూర్చుని వుంది. రాముని కుడిచేతిలో ధనువు వుంది. ఎడమచెయ్యి సీతాదేవి నడుముకు చుట్టివుంది.

దేవాలయం రథాకారంలో వుంది. నాలుగు మూలలా నాలుగు చిన్న విమానాలు, మధ్యలో ఒక పెద్దవిమానం వున్నాయి. దేవాలయం అడుగుభాగంలో యేర్పాటుచేసిన చక్రాలు చుట్టూ ప్రాకారం లేవడంవల్ల మరుగుపడి పోయాయి.

దానికి రెండంతస్తులున్నాయి. పైకి ఎక్కడానికి వుత్తర, దక్షిణపు వైపుల మెట్లున్నాయి. లోనికి వెళ్లేమార్గంగాను, బయటికిపోయే మార్గంగాను రెండువైపుల మెట్లు వుపయోగించబడుతున్నప్పటికీ వుత్తరపుమార్గం వుత్తరాయణంలోను, రెండవది దక్షిణాయణంలోను వుపయోగింపబడా లేమో అనిపిస్తుంది. కుంభకోణంలోని శ్రీ సారంగపాణి పెరుమాళ్ దేవాలయంలో యిట్టి ఆచారం వుంది.

క్రింది అంతస్తులో సుదర్శనచక్రం ప్రతిష్ఠించబడింది. దానిపైన మధ్య రాతి స్తంభంతో మేరుపురకం కట్టడంవుంది. కింది అంతస్తులో మేరు యంత్రానికీ, పై అంతస్తులో దేవుళ్ళకీ పూజ చేయబడుతుంది.

ఇక్కడ గమనార్హమైన మరొక విశేషమేమంటే గుడిలో సత్యనారాయణస్వామి పక్కన లింగం ప్రతిష్ఠించ బడింది. ఇది స్వామికి యెడమవైపున వుంటుంది. లక్ష్మీ దేవి కుడివైపున వుంటుంది. ఈముగ్గురు దేవతల విగ్రహాలు నిగనిగ మెరిసే నల్లని రాతితో చేయబడినవి.

ఇంతేకాక సత్యనారాయణస్వామికి సరిగ్గా వెనుక ఒక లోహపు శూలము, లక్ష్మీదేవికి ముందర పార్వతి కంచు విగ్రహము, శ్రీ చక్రము వున్నాయి. ప్రధాన దైవము ముందర ఒక స్ఫటికలింగము, కొన్ని సాలిగ్రామాలు కూడా వున్నాయి. కింది అంతస్తు ప్రదక్షిణంలో ఆగ్నేయమూల వినాయకుడు, నైఋతిమూల సూర్యాదేవి, వాయవ్యమూల పార్వతి, ఈశాన్యమూల ఈశ్వరుడు (లింగం) వున్నారు. ఈవిధంగా కిందిభాగం పంచాయతన దేవాలయంగా చేయ బడినది. శైవ వైష్ణవులమధ్య గాఢానుబంధాన్ని సాధించ



*బంగారు కవచములు రత్నాల హారములతో అలంకరింపబడిన శ్రీ సత్యనారాయణస్వామి విగ్రహం*
*శ్రీ వీరవెంకట సత్యనారాయణస్వామి, శ్రీ అనంత లక్ష్మి సత్యవతీదేవి,*
*ఉత్సవరులు ఈ చిత్రంలో కన్పిస్తారు*

దానికై వుద్దేశ పూర్వకంగా యివి యిలా ప్రతిష్ఠించబడి వుండవచ్చును. ఈరకం పూజను ఆగమాలు చెప్పలేదు కనుక యీ దేవాలయంలో పూజకు ప్రత్యేక పద్ధతి అవలంబించ బడుతుంది. ఇక్కడ పూజ శంకరనారాయణ, హరిహర విగ్రహాల పూజను జ్ఞాపకం చేస్తుంది. ఈ విగ్రహాలలో అర్ధభాగంలో శివుడు, మిగిలిన అర్ధభాగంలోను విష్ణువు వుంటారు.

సత్యనారాయణ, లక్ష్మీదేవుల వుత్సవ విగ్రహాలు యిప్పుడు సీతారామ దేవాలయంలో వుంచబడినవి. రెండు విగ్రహాలు కూడా మిక్కిలి చిన్నవి. ముద్దులొలుకుతూ వుంటాయి.

స్వామి యోధుని వేషభాషలతో నిలుచుని వుంటాడు. ఆయన కుడిచేతిలో విల్లు.యెడమచేతిలో అమ్ము వుంటాయి. విల్లు అసాధారణమైన పద్ధతిలో ముష్టి భక్తుని వైపుకుత్రిప్పి పట్టుకొనబడింది. అమ్ముధరించిన యెడమచేయి అభయ ముద్రలోవుంది. ఇది ఆయన భక్తులకు రక్షణను తెలియ చేస్తుంది. ఆయన విల్లంబులు. ఆయన తనభక్తుల రక్షణకు సర్వదా సంసిద్ధుడై ఉంటాడన్న విషయాన్ని సూచిస్తాయి. ఆయనకు చక్కని మీసాలుకూడా వున్నాయి. ఇవి ఆయన వీరత్వాన్ని సూచిస్తాయి. ఈకారణంగా ఆయనకు వీర వెంకట సత్యనారాయణ అని పేరువచ్చింది.

## సింహాచలము

సింహాచలం భారతదేశంలోని హిందువుల యాత్రా స్థలాల్లో ప్రముఖమైన యాత్రాస్థలాల కోవకి చెందుతుంది. అక్కడ నరసింహస్వామిపై భక్తితో నిర్మించబడిన ప్రాచీన దేవాలయాన్ని ప్రతి సంవత్సరమూ వేలాది భక్తులు దర్శిస్తారు.



కల్యాణ మంటపం దృశ్యం



శ్రీ సత్యనారాయణస్వామి ఆలయ విమానం దృశ్యం



*కొండ క్రిందభాగంనుంచి చూస్తే కన్పించే గోపురం, కనకదుర్గాలయం మున్నగువాటి దృశ్యం*

దక్కను తూర్పుతీరాన్నే వ్యాపించిన తూర్పు కనుమలలో సింహాచలం, భద్రాచలం, శ్రీశైలం, అహోబిలం, తిరుపతివంటి పుణ్యస్థలాలు చాలా వున్నాయి. ఇక్కడ దేవాలయాలన్నీ దట్టమైన అడవులమధ్య వున్నాయి. అక్కడవున్నజలం ఘాటజలంకాని నదీజలంకాని ఖనిజ సంబంధమైనది. ఇవి యీ దేవాలయాలన్నిటికీ వుండే సామాన్యమైన ముఖ్య లక్షణాలు.

సింహాచలం ఆంధ్రదేశంలో మిక్కిలి ప్రధానమైన వైష్ణవ దేవాలయాలుండే స్థలాల్లో ఒకటిగా పరిగణించబడుతున్నది. ఇది కలకత్తా - మద్రాసు మార్గంలో విశాఖపట్నానికి దాదాపు 11 మైళ్ళ దూరంలో సముద్రమట్టానికి 800 అడుగుల యెత్తునవుంది.

ఇక్కడి దేవాలయం యెప్పుడు నిర్మించబడిందో తెలియదు. ఇది కొండకొమ్మున వుంది. దీనిని చేరడానికి దగ్గరగా 1,120 మెట్లను యెక్కి వెళ్ళాలి. ఈ మెట్లు స్వామికి సమర్పణగా భక్తులు కట్టించినవే.

ప్రహ్లాదుడు హిరణ్యకశిపునిచే సముద్రంలో త్రోయబడినప్పుడు భక్తుని రక్షించడానికై స్వామి యిక్కడ ప్రత్యక్షమయాడని ప్రాచీనగాథ. స్థలపురాణంప్రకారం యీ దేవాలయాన్ని ప్రహ్లాదుడు నిర్మించాడు.

క్రీస్తువెనుక 1098-99 మధ్య కళింగదేశంలో కొన్ని ప్రాంతాలను జయించిన 1 వ కులోత్తుంగచోళుని శాసనం యీ కొండపై కనబడుతుంది. ముఖమండపాన్ని, నాట్యమండపాన్ని క్రీస్తువెనుక 1267-68 లో 1 వ నరసింహరాజు నిర్మించాడని మరొకశాసనంవల్ల తెలుస్తుంది. నాట్యమండపానికి 96 స్తంభాలున్నాయి. దీని నిర్మాణకౌశలం ముఖమండపం నిర్మాణకౌశలంకంటె మిన్నగా వుంటుంది. కళింగయుద్ధం పిమ్మట శ్రీకృష్ణదేవరాయలు స్థాపించిన విజయస్తంభంగూడా యిక్కడవుంది.

ఇక్కడ ఆకాశధార మాధవధారలవంటి జలధారలు అనేకం వున్నాయి. యాత్రికులు దేవాలయంలోనికి వెళ్లేముందు వీటిలో స్నానంచేస్తే హాయిగా వుంటుంది.

ఈ ప్రాచీనదేవాలయం మతాచారపరులను ఆకర్షించడమేకాక ఆంధ్రశిల్పుల శిల్పనైపుణికి శాశ్వత చిహ్నమైన కళాఖండంగా విరాజిల్లుతున్నది. ఇక్కడి శిల్పాలు వైష్ణవ సాంప్రదాయమైన కథలకు సంబంధించినవి.

[తరువాయి 37 వ పేజీలో]




డిసెంబరు, 1956

1. "పతాకదినోత్సవం"నాడు ఆంధ్రప్రదేశ్ గవర్నరు రాష్ట్ర ప్రజానీకానికి ఒక సందేశమిస్తూ పతాకదినోత్సవ నిధికి ఉదారంగా విరాళాలిచ్చి నిర్ణయింపబడిన లక్ష్యాన్ని పూర్తిచేయవలసిందిగా కోరారు.

2. యూనియన్ ప్రభుత్వ భారీపరిశ్రమలమంత్రి అహమదాబాదులో ఒక సందర్భంలో ప్రసంగిస్తూ పథకబద్ధమైన అభివృద్ధి ననుసరించి బొగ్గు పరిశ్రమకు ఏర్పడే యంత్ర పరికర సంబంధమైన అవసరాలను తీర్చడానికై హైద్రాబాదులో ఒకపెద్ద యంత్రపరికరముల ఫ్యాక్టరీ నెలకొల్పబడ గలదని తెలిపారు.

3. ఆంధ్రప్రదేశ్ శాసనసభ తొలిసారిగా సమావేశమైంది. ఈ సమావేశంలో తెలంగాణా సభ్యులు విస్తృత రాష్ట్ర అసెంబ్లీ సభ్యులుగా ప్రమాణస్వీకారం చేశారు.

4. శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు ఏకగ్రీవంగా శాసనసభాధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు. త్వరలో ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలలోని అమ్మకపుపన్నుకు సంబంధించిన శాసనాలను సమన్వయం చేయవలెనని తమ ఉద్దేశమైనట్లు ప్రభుత్వం ప్రకటించింది.

5. రాష్ట్ర శాసనసభకు ఎగువసభను ఏర్పాటుచేయవలసిందని యూనియను పార్లమెంటుకు సిఫారసుచేస్తూ రాష్ట్ర శాసనసభలో ఒక తీర్మానం అవసరమైన ఓట్లకంటే మెజారిటీ ఓట్లతో ఆమోదించబడింది.

6. హైద్రాబాదు నగరంనుంచి 40 మైళ్ళ దూరానవున్న బోధన్‌లో రూ. 6 కోట్ల వ్యయంతో చెరకుపిప్పితో పత్రికల కుపయోగించే న్యూస్‌ప్రింట్ కాగితాన్ని తయారుచేసే ఫ్యాక్టరీ నెలకొల్పబడ గలదని కార్మిక పరిశ్రమలశాఖా మంత్రి తెలిపారు. దక్షిణ భారతంలో ఇటువంటిది ఇదే మొదటి ఫ్యాక్టరీ అవుతుంది.

7. పునర్వ్యవస్థీకరణ చేయబడిన నూతన రాష్ట్రంలో వివిధ విద్యుచ్ఛక్తి నీటివనరు ప్రాజెక్టుల ప్రగతినిగూర్చి రాష్ట్ర ముఖ్యమంత్రి కొత్త ఢిల్లీలో ప్లానింగ్ కమీషన్ ఉపాధ్యక్షునితో చర్చలు జరిపారు.

8. ఆంధ్ర ప్రాంతంలోని జిల్లాబోర్డుల సలహాసంఘాలు వాటిగడువు ముగియడంతోనే 1956 డిశంబరు 10 వ తేదీ నుంచి రద్దు అయిపోగలవని ప్రభుత్వం నిర్ణయంచేసింది.

9. ఆలిండియా రేడియో విజయవాడ కేంద్రంలో కొత్తగా పెట్టబడిన 20 కిలోవాట్ల మీడియంవేవ్‌ట్రాన్స్మిటర్ పనిచేయ నారంభించింది.

10. యూనివర్సిటీ గ్రాంట్సు కమీషన్ అధ్యక్షుడు శ్రీ సి. డి. దేశ్‌ముఖ్ ఆంధ్ర విశ్వవిద్యాలయంలో న్యూక్లియర్ ఫిజిక్సు లేబొరేటరీలకు శంకుస్థాపన చేశారు.

11. హైద్రాబాదులోని భూ సంస్కరణలను గూర్చి ఒక విద్వద్గోష్ఠిని జరుపవలెనని రెవిన్యూబోర్డు చేసిన ప్రతిపాదనను ప్రభుత్వం ఆమోదించింది.

12. రాష్ట్రంలోని ఉద్యోగాలలోకి అభ్యర్థులను తీసుకొనే విషయంలో శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం ఇచ్చినటువంటి డిగ్రీలను సర్టిఫికెట్లను తత్తుల్యమైన ఆంధ్ర విశ్వవిద్యాలయ డిగ్రీలతో సర్టిఫికెట్లతో సమానంగా పరిగణించవలెనని ప్రభుత్వం ఆదేశించింది.

13. ప్రభుత్వ భాగస్వామ్యం గల 36 పరిశ్రమలు ఏ విధంగా పనిచేస్తున్నవో విచారణ జరిపి, వాటిని పటిష్ఠం చేయడానికి ఎట్టి చర్యలు గైకొనాలో సూచించవలసిందిగా ప్రభుత్వం, త్వరలో ఒకకమిటీని నియమించ నున్నదని రాష్ట్ర ముఖ్యమంత్రి పత్రికా ప్రతినిధులతో ముచ్చటిస్తూ తెలియజేశారు.

14. 1957-58 సంవత్సరపు రాష్ట్ర వార్షిక ప్రణాళికలో చేర్చడానికై రూ. 40 కోట్లు వ్యయంకాగల పథకాలను ప్రభుత్వం ప్లానింగు కమీషనుకు పంపింది.

15. ఆంధ్ర ప్రాంతంలోని జిల్లాబోర్డుల ఎన్నికలు 1957 జూన్‌లో జరుగగలవని రాష్ట్ర స్థానిక స్వపరిపాలనా మంత్రి పత్రికా విలేఖరులకు చెప్పారు.

16. ట్రేడ్ యూనియనులు గనుక సహకార ప్రాతిపదికపై చౌక ధాన్యం దుకాణాలను నడుపడానికి పూనుకున్నట్లయితే ప్రభుత్వం సప్లయిలు చేయగలదని రాష్ట్ర కార్మిక మంత్రి హామీ ఇచ్చారు.

17. ప్రాజెక్టు ప్రాంతాలకు అవసరమైన సూపర్వయిజర్లకు శిక్షణ ఇచ్చే భారత్ సేవక్ సమాజ్ కేంద్రానికి రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం జరిపారు. ఈ కేంద్రం హైద్రాబాదు నగరానికి 10 మైళ్ళ దూరానవున్న మొయిన్ బాగ్‌లో కలదు.

18. బొంబయి రాష్ట్రానికి కేటాయింపబడి, నియామకపు టుత్తర్వులు పొందినట్టి పూర్వపు హైద్రాబాదు ప్రభుత్వోద్యోగులు డిసెంబరు 25 తేదీలోపల డ్యూటీలో చేరకపోయినట్లయితే వారు ఉద్యోగం వదిలిపెట్టి తిరుగుతున్న వ్యక్తులుగా పరిగణింపబడగలరని హెచ్చరిక చేయబడింది.

19. మధ్యప్రదేశ్ గవర్నరు రెండు రోజుల మకాం కొరకై హైద్రాబాదు విచ్చేశారు.

20. హైద్రాబాదు నగరంలోని హెచ్చు స్థాయి జీవిత వ్యయ ప్రమాణానికి తట్టుకొని నిలువగలగాలంటే రాష్ట్ర ప్రభుత్వ సర్వీసులోవున్న నాన్‌గెజిటెడ్ ఉద్యోగులకు, నాల్గవ తరగతి సిబ్బందికి కొంత అలవెన్సు ఇవ్వడం భావ్యం కాగలదనే అభిప్రాయాన్ని ముఖ్యమంత్రి వెల్లడించారు.

21, పంచన్‌లామా, దలైలామాలు నాగార్జునకొండ సందర్శించారు.

22. హైద్రాబాదులోని ఇన్‌స్టిట్యూషన్ ఆఫ్ ఇంజనీర్స్ సంస్థలో రాష్ట్రి గవర్నరు ప్రసంగిస్తూ పరిపాలకులకూ నిపుణులకూ మధ్య సమన్వయం సాధింపబడినట్లయితే వివిధ పథకాలు ప్రాజెక్టులు అమలు జరగడంలో కలుగుతున్న జాప్యం చాలావరకు నివారించబడగలదని అన్నారు.

23. కార్మికులు పనిలోకిరాకుండ వుండడం, పని మెల్లగాచేస్తూ జాప్యం చేయడం మొదలగునవి జపాను దేశములో జాతీయ వ్యతిరేక, సంఘ వ్యతిరేక చర్యలుగా పరిగణింపబడుతున్నాయనీ, కనుక జాతియొక్క శ్రేయస్సును ప్రధానంగా భావించునటువంటి జపాను దేశకార్మికులను చూచిఅయినా భారతదేశ కార్మికులుగుణపాఠం నేర్చుకోవాలనీ భారత జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు హైద్రాబాదుశాఖ అధ్యక్షులు అన్నారు.

24. రాష్ట్రి వ్యవసాయశాఖామంత్రి అనంతపురంజిల్లా ధర్మవరం తాలూకాలో ఒక సందర్భంలో ప్రసంగిస్తూ ప్రభుత్వం రైతులకొరకు ఒక పాఠశాలను తెరువగలదని తెలిపారు.

25. కాలమాన పరిస్థితులు సరిగాలేక తక్కువపంట దిగుబడి కారణంగా బాధితులయినటువంటి తెలంగాణా ప్రాంతపు రైతులకు సిస్తు రెమిషన్ ఇవ్వడానికి ప్రభుత్వం నిర్ణయించింది.

26. భారత విజ్ఞానశాస్త్ర పరిషత్తు 22 వ వార్షిక సమావేశాన్ని ప్రారంభిస్తూ శాస్త్రజ్ఞులు తమ శాస్త్రీయ పరిశోధనలతోపాటు ప్రజలకు చక్కగా బోధపడేభాషలో విజ్ఞాన శాస్త్రములనుగూర్చిన సారస్వతమును సిద్ధం చేయవలసిందిగా రాష్ట్రి గవర్నరు సూచించారు.

27. భారత ప్రభుత్వ న్యాయశాఖలో మంత్రి ఆంధ్ర-మద్రాసు సరిహద్దుల వివాదం విషయంలో మద్రాసు ప్రభుత్వంతో చర్చలు ముగించుకున్నపిమ్మట తిరుపతిలో ఆంధ్ర. హోసూరు ప్రతినిధివర్గాల విజ్ఞాపనలను విన్నారు.

28. రాష్ట్రి సహాయ కేడెట్‌దళం తాలూకు బాలికల విభాగపు కార్మిక సంఘసేవా శిబిరానికి రాష్ట్రి విద్యాశాఖ మంత్రి ప్రారంభోత్సవం చేశారు. నూతన్న రాష్ట్రింఏర్పడిన తరువాత ఈ శిబిరం నిర్వహింపబడడం ఇదే ప్రథమ పర్యాయం.

ఆంధ్రప్రదేశ్‌లోని నియోజకవర్గాల పునర్విభజన విషయమై చేయబడిన అంతిమ ప్రతిపాదనలనుబట్టి రాష్ట్రింలోని ఇరవై జిల్లాలలో 43 పార్లమెంటు స్థానాలుగల 35 పార్లమెంటరీ నియోజకవర్గాలు. 301 అసెంబ్లీ స్థానాలుగల 249 అసెంబ్లీ నియోజకవర్గాలు వున్నట్లు తెలుస్తున్నది.

29. సాధారణ ఎన్నికలలో రాష్ట్రింలో 1957 ఫిబ్రవరి 25 వ తేదీ మొదలు మార్చి 11 వ తేదీవరకు అయిదు దశలుగా పోలింగు జరుగగలదని చీఫ్ ఎలెక్టోరల్ ఆఫీసర్ ప్రకటించారు.

కొత్త ఢిల్లీలో జరిగిన రాష్ట్రి వ్యవసాయశాఖామంత్రుల సమావేశంలో ముఖ్యమైన వ్యవసాయ పంటలకు కనిష్ఠ ధరలు నిర్ణయించడానికి త్వరలో తగుచర్యలు గైకొనబడవలెనని భారత ప్రభుత్వానికి సిఫారసు చేయబడింది.

30. రానున్న సాధారణ ఎన్నికలకు తయారీకొరకై ఆంధ్రప్రదేశ్‌లో మొట్టమొదటి పోలింగు రిహార్సల్ హైద్రా

బాదు నగరానికి ఏడుమైళ్ళ దూరంలోవున్న అల్వాల గ్రామంలో జరిగింది.

31. నవంబరు, డిసెంబరు నెలల్లో రాష్ట్రములోని కార్మిక పరిస్థితి ప్రశాంతంగావుందనీ, కార్మికులకూ, యజమానులకూ మధ్య ఏర్పడిన వివాదాలు పరస్పరామోదము ద్వారా పరిష్కరించుకోబడ్డాయనీ రాష్ట్ర కార్మిక పరిశ్రమల శాఖామంత్రి వెల్లడించారు.

* * *



## హిందూస్తాన్ నౌకా నిర్మాణశాల

[18 వ పేజీ నుండి]

షాపులు, మెషిన్ షాపుల ఉత్పత్తిని బాగా హెచ్చించడము, 35 టన్నుల యూనిట్ల ఉత్పత్తిని చేయగల పెద్దపోత విభాగాన్ని కొత్తగా నిర్మించడం, క్రేనులను కదలించే ఇతర పరికరాలను ఎక్కువగా అమర్చడం, మొదలగుపనులు తలపెట్టబడినవి. 1956 సంవత్సరం నాటికల్లా నౌకా నిర్మాణశాల ఉత్పత్తి స్తోమత 50,000 డి. డబ్ల్యు. టి. కి పెరుగుతుంది.

ఈ నౌకా నిర్మాణశాలలో పనిచేసే ఉద్యోగులకూ, సిబ్బందికీ వుండడానికై 144 ఎకరాల విస్తీర్ణములో ఒక కాలనీ నిర్మించబడింది. ఈ కాలనీలో సౌకర్యవంతమయిన పలురకాల ఇండ్లుకలవు. ఇది ఆధునిక పట్టణ నిర్మాణ పద్ధతులపై నిర్మింపబడింది. కాలనీలో ఒక ఉచిత ప్రాథమిక పాఠశాల, ఒక ఉచిత ఔషధశాల, ప్రసూతికేంద్రం, పిల్లలకు ఆటస్థలం మొదలయినవి కలవు. ఉత్తమ ప్రమాణాల ప్రకారం పారిశుధ్యం నిర్వహింపబడుతున్నది. కాలనీ నిర్మాణానికి రూ. 77 లక్షలు ఖర్చు అయినవి. ఇందులో 1500 మంది ఉద్యోగులు నివసిస్తున్నారు.



## అన్నవరపు శ్రీ సత్యనారాయణస్వామి దేవాలయం

[34 వ పేజీ తరువాయి]

ప్రతిసంవత్సరము యిక్కడ చందనయాత్ర అనే మత సంబంధమైన పెద్ద ఉత్సవం జరుగుతుంది. దీనికి ఆంధ్ర దేశం అన్ని ప్రాంతాలనుంచి యాత్రికులు వస్తారు. ఈ దేవుని ప్రేమగాథ ఆంధ్రులకు బహుసన్నిహితమైనది. దాని గురించి పెక్కు జానపదగేయాలు, శతకాలు వెలువడ్డాయి.

ఈ దేవాలయంచుట్టూ వున్న ప్రకృతి దృశ్యాలు - అడవులతోను, పైరుచేలు, పళ్లతోటలతో కూడిన సారవంతమైన లోయలతోను కూడిన కొండప్రదేశాలు- మహావైభవముగా వుంటాయి.

* * *



# వార్తలు - విశేషాలు

## ద్రాక్షారామ మునిసిపాలిటీ

1956 నవంబరు 1 వతేదీనుంచి తూర్పు గోదావరిజిల్లా, రామచంద్రపురం తాలూకాలోని ద్రాక్షారామం, తోటపేట, జగన్నాయకులపల్లి, వెలమపాలెం పంచాయితీల అధికారావరణలో గల ప్రాంతాన్ని 'ద్రాక్షారామ మునిసిపాలిటీ'గా ఏర్పాటుచేస్తూ ప్రభుత్వం ఉత్తరువు జారీచేసింది. ఈమునిసిపాలిటీలో 16 మంది కౌన్సిలర్లు వుంటారు.

## శుక్రవారం ప్రార్థనలు

శుక్రవారాలనాడు మసీదులలో ప్రార్థనలు సలుపదలచుకొన్న ప్రభుత్వ ముస్లిం ఉద్యోగులకు ఆ రోజులలో మధ్యాహ్నం 12-30 గం.లనుంచి 2 గంటల మధ్యలో 1-30 గం. వరకు ఆఫీసు విడిచిపెట్టి వెళ్ళుటకు ప్రభుత్వం అనుమతి ఇచ్చింది.

## పాఠశాలలకు పాఠ్యపుస్తకములు

పూర్వపు హైద్రాబాదు రాష్ట్రి విద్యాశాఖలో తమ పేర్లను రిజిస్టరు చేయించుకొన్నట్టి ప్రచురణ కర్తలకు రచయితలకు ఇందుమూలమున తెలియజేయున దేమనగా ఆంధ్రప్రదేశ్‌లో తెలంగాణా జిల్లాలలోని పాఠశాలల్లో 1957-58 విద్యా సంవత్సరానికి 5 మొదలు 10 వ తరగతివరకు ఉపయోగార్థమై నిర్ణయింపబడుటకు మరియు సిఫారసు చేయబడుటకు భాష, భాషేతర విషయములకు సంబంధించిన పాఠ్య పుస్తకాలను 1957 ఫిబ్రవరి 28 వ తేదీ లోపుగా హైదరాబాదులోని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సెకండరీ ఎజుకేషన్ బోర్డు కార్యదర్శికి దాఖలు చేయవలెను. పై తేదీ తరువాతవచ్చిన పుస్తకములు స్వీకరింపబడవు. 5 మొదలు 7 వ తరగతి వరకు దాఖలు చేయబడు పుస్తకములు 1943 జూన్ నెలనుంచి అమలులోవుండి 1950లో సవరింపబడినట్టి పాఠ్య ప్రణాళిక ననుసరించి ఉండవలెను. 8, 9, 10 తరగతుల పుస్తకములు 1952 నుంచి అమలులోవున్న పాఠ్య ప్రణాళిక ప్రకారము వుండవలెను. ఇతర వివరములు విడిగా ప్రచురణ కర్తలకు, రచయితలకు పంపబడు సర్క్యులర్‌లో చూచుకోవచ్చును.

## డిగ్రీల పరిగణన

ఆంధ్రప్రదేశ్‌లో వివిధ ఉద్యోగాలలో అభ్యర్థుల నియామకానికై శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం ఇచ్చే డిగ్రీలను, సర్టిఫికెట్లను ఆంధ్ర విశ్వవిద్యాలయం ఇచ్చే ఆయా డిగ్రీలతో, సర్టిఫికెట్లతో సమానంగా పరిగణించుటకు ప్రభుత్వం ఆదేశించింది.

## అమ్మకం పన్ను నుంచి మినహాయి పు

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రి లో చేర్చబడిన ప్రాంతాలలో 1957 మార్చి 30 వ తేదీవరకు వ్యవసాయ శాఖద్వారా రైతులకు విక్రయింపబడే ఆయిల్ ఇంజనులపైన పంపులపైన అమ్మకం పన్ను విధింపబడదు. వ్యవసాయం నిమిత్తం అవి కొనబడుతున్నాయని పైశాఖ ఇచ్చిన సర్టిఫికెటును చూపినపక్షంలో కూడా అవి అమ్మకం పన్నునుంచి మినహాయింపబడగలవు.

## ఆయుధాల లైసెన్సులు

రాష్ట్రింలోగాని లేదా ఒక భాగంలోగాని లేక భారత యూనియనులో గాని అన్నివిధములైన ఆయుధాల లైసెన్సుల మంజూరీకొరకు లేదా వాటి

పునః చెలామణికొరకు భారత ఆయుధాల చట్టం మరియు నియమావళి ప్రకారం 1957 జనవరి 1 వ తేదీన ఆ తరువాత పంపబడే దరఖాస్తులన్నీ దరఖాస్తుదారు నివసిస్తూవుండే ప్రాంతానికి చెందిన ప్రాంతీయ లైసెన్సింగ్ అధికార్లకు అనగా జిల్లాలు అయితే కలెక్టర్ల పేర, హైదరాబాదు సికింద్రాబాదు నగరాల హద్దుల లో నైతే పోలీసు కమీషనరు పేర వ్రాసిపంపవలెను.

## ఆభరణములపై అమ్మకం పన్ను

1956 అక్టోబరు 1 వ తేదీ నుంచి అన్ని విధములైన బంగారపు నగలపై అవి రత్నాభరణాలైనా కాకపోయినా, 1953 ఆంధ్ర రాష్ట్ర చట్టం (1953 సం.పు 30 వ కేంద్ర చట్టం) యొక్క 3 వ సెక్షనులో సూచింపబడిన ప్రాంతాలలో సింగిల్ పాయింట్ అమ్మకం పన్ను మాత్రం విధింపబడగలదు. అపన్ను 1939 మద్రాసు సాధారణ అమ్మకాల పన్ను చట్టపు 3 వ సెక్షనులోని (2-ఎ) ఉపసెక్షను ప్రకారం వ్యాపారం మొత్తంలో 1 వ శాతంలో సగభాగం వుండగలదు.

## మోటారు రవాణా పరిశ్రమ

1947 వ సం.పు పారిశ్రామిక వివాదాలచట్ట నిమిత్తమై ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో మోటారు రవాణా పరిశ్రమ, ఈ ప్రకటన అధికార గెజెటులో ప్రకటితమైనప్పటి నుంచి ఆరు నెలల వరకు ప్రజోపకరమైన సర్వీసుగా ప్రకటించబడింది.

## ప్రత్యేక రైల్వే మేజిస్ట్రేటు కోర్టు

విశాఖపట్నం జిల్లా విజయనగరంలో ప్రత్యేక రైల్వే మేజిస్ట్రేటు కోర్టు 1958 మార్చి 31 వ తేదీ వరకు పనిచేయడానికి ప్రభుత్వం మంజూరీ ఇచ్చింది.

## పంచాయితీలు

పంచాయితీల మామూలు ఎన్నికలు జరుగు సందర్భంలో వాటి విభజన, లేదా వాటి అధికారావరణల మార్పు లేదా వాటి వార్డుల పునర్వ్యవస్థీకరణ లేదా అట్టి వార్డులలో స్థానాల కేటాయింపు లేదా తరగతులవారి విభజనలో మార్పు చేయడం వాంఛనీయంకాదని ప్రభుత్వం ఆదేశించింది. అందువల్ల నియమానుసారంగా ఇక ముందు ఇటువంటి మార్పులు పంచాయతీలకు సాధారణ ఎన్నికలు జరిగిన మొదటి రెండు సంవత్సరాలలో మాత్రమే జరగాలని ప్రభుత్వం ఆదేశించింది.

## కమతముల ఏకీకరణ

1956 సంవత్సరపు హైదరాబాదు భూకమతముల విభజన నిరోధక, మరియు ఏకీకరణ చట్టంలోని 41 వ సెక్షన్ యొక్క 2 వ ఉపసెక్షన్‌వల్ల సంక్రమించిన అధికారాలను పురస్కరించుకొని ఈ ప్రకటన అధికార గజెటులో ప్రచురితమైన తేదీలగాయతు ప్రకటిత స్థానిక ప్రాంతాల విషయంలో మెదకుజిల్లా కలెక్టరుకు సదరు చట్టము ననుసరించి సెటిల్మెంట్ కమీషనర్ అధికారములను రెవిన్యూబోర్డు ఇచ్చినది.

## సేల్సుటాక్సు కమీషనరు

ఆంధ్రప్రదేశ్ లో చేర్చబడిన ప్రాంతం విషయంలో 1950 సం. హైదరాబాదు సాధారణ అమ్మకం పన్ను చట్టం క్రింద రెవిన్యూ బోర్డు, సేల్సుటాక్సు కమిషనరు యొక్క అధికారాలను 1956 నవంబరు 1 నుంచి వినియోగించుటకు గవర్నరు ఉత్తర్వు చేశారు.

## పాక్షిక సెలవులు

కొన్ని జాతులవారి పండుగలు కార్యాలయాలు పనిచేసే రోజులలో రాగలవు. ఆ రోజులు సాధారణ పబ్లిక్ సెలవులుగా పరిగణింపబడవు. అయితే ఆయా జాతి ప్రభుత్వోద్యోగులు తమ మతానికి సంబంధించిన వేడుకలలో పాల్గొనగోరదలచినట్లయితే వారు తమ ఉన్నతాధికారికి దరఖాస్తు పెట్టుకోవడం ద్వారా ఆయా రోజులలో సెలవులు పొందవచ్చును.

## రాష్ట్ర జీవిత భీమా ప్రావిడెంటు ఫండు

హైదరాబాదు రాష్ట్ర జీవిత భీమా, ప్రావిడెంటు ఫండు నియమావళికి సవరణ చేయబడిన ఫలితంగా యీ రెండు ఫండులు ఆర్థిక మంత్రి, ఆర్థిక కార్యదర్శి, ప్రభుత్వం ముగ్గురు వ్యక్తులకు మించకుండా

నామినేటు చేయు ఇతర సభ్యులతో ఏర్పాటు చేయబడిన మేనేజింగు కమిటీ అధ్వర్యాన నిర్వహింపబడుతాయి. కమిటీకి ఆర్థికమంత్రి అధ్యక్షులుగా వ్యవహరిస్తారు. కమిటీ కార్యదర్శి హైద్రాబాదు రాష్ట్రజీవిత భీమా ఫండు ప్రభుత్వాధికారిగా కమిటీ అధ్వర్యానపనిచేస్తారు. న్యాయశాఖ కార్యదర్శి, మెడికల్ సర్వీసులడైరెక్టరు, బొంబాయిప్రభుత్వంలో డిప్యూటీ సెక్రటరీవహోదాకు తక్కువ కాని వ్యక్తి మేనేజింగు కమిటీలో సభ్యులుగా ఉంటారు.

## "వాడబలిజలు"

వెనుకబడిన తరగతుల జాబితాలో రాష్ట్ర "వాడబలిజల" ను చేర్చుకోవాలని ప్రభుత్వం ఆదేశించింది. "వాడబలిజల" కు లభించు సౌకర్యాలు ఇతర బలిజకులాల వారికి వర్తించవు.

## టౌను ప్లానింగ్ డైరెక్టరు

స్థానిక పరిపాలనాశాఖ ఇనస్పెక్టరు జనరల్ 1956 నవంబరు 1 వ తేదీనుంచి ఆంధ్రప్రదేశ్ టౌను ప్లానింగు డైరెక్టరుగా నియమించబడినారు.

## ప్యాస్ పోర్టులు

అంతర్జాతీయ ప్యాస్‌పోర్టులు, ఇండో-సిలోన్ ప్యాస్ పోర్టులు జారీచేయుట, పునరుద్ధరించుటకు సంబంధించిన వ్యవహారాలలో 1956 డిసంబరు 1వ తేదీనుంచి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం మద్రాసులోని ప్రాంతీయ ప్యాస్‌పోర్టు కార్యాలయపు అధికార ప్రాంతంలో చేర్చబడిందని ఇందుమూలంగా ప్రకటించడమయినది. భారత-పాకిస్తాన్ ప్యాస్‌పోర్టులను మాత్రం ఇంతకు పూర్వంలాగా రాష్ట్ర ప్రభుత్వమే జారీచేస్తుంది.

## యస్. యస్. యల్. సి. పరీక్ష

1957 మార్చిలో జరుగు యస్.యస్.యల్.సి. పరీక్షకు కూర్చొను బాలురు, బాలికల వయస్సు నిర్ణీత వయస్సుకు ఒక సంవత్సరం తక్కువగా ఉన్నట్లయితే అందుకు బాలుర విషయంలో జిల్లా విద్యాశాఖాధికారులు, బాలికల విషయములో ఇనస్పెక్ట్రెస్ మినహాయింపు ఇవ్వవచ్చుననీ, 1956-57 సంవత్సరం తరువాత కనీస వయస్సులేని అభ్యర్థులకు ఏలాంటిమినహాయింపుకూడా ఇవ్వకూడదనీ పూర్వపు ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వ విద్యాశాఖ 1956 మే 7 వ తేదీన ఉత్తరువుచేసింది.

అయితే 1956-57 విద్యా సంవత్సరంలో యీ ఉత్తరువును ఆపివుంచాలని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విద్యాశాఖ ఆదేశించింది. వయస్సుకు సంబంధించిన పాత నియమావళి 1957 మార్చిలో జరుగు యస్.యస్.యల్.సి. పరీక్షకు కూర్చొను విద్యార్థులకు, విద్యార్థినులకు వర్తిస్తుంది. ఈ నిబంధనలు పూర్వపు ఆంధ్రరాష్ట్రంలో చదువుతున్న విద్యార్థులకూ, గుంటూరు, కర్నూలునుంచివచ్చి హైద్రాబాదులో చదువుతున్న విద్యార్థులకు వర్తిస్తాయి.

## గమనిక

1956 నవంబరు - డిసెంబరు నెల "ఆంధ్రప్రదేశ్" సంచికలో 66-74 పేజీలలోని రాష్ట్ర శాసన సభ్యుల జాబితాలో యీ క్రింది సవరణలను పాఠకులు గమనింపప్రార్థన :-

శ్రీ బి. యం. చంద్రారావు (నెం. 25) శ్రీ బట్టి రాజారాం (నెం. 42) శ్రీమతి రాజమణీదేవి (నెం. 57) గారలు కాంగ్రెసు పార్టీకి చెందినవారు. ఆ సంచికలో తెలుపబడినట్లు వారు పెద్యూల్డు కులాల ఫెడరేషన్ పార్టీకిచెందినవారు కారు.

శ్రీ కె. వీరాస్వామి (నెం. 80) శ్రీ బి. వీరాస్వామి (నెం. 81) గారలు స్వతంత్ర సభ్యులు.

శ్రీ గొల్లకోట శ్రీరాములు (నెం. 94) గారు ఆ సంచికలో తెలుపబడినట్లు సోషలిస్టుపార్టీకి చెందినవారు కారు. వారు కాంగ్రెసు పార్టీకి చెందినవారు.

1957 జనవరి నెల ఆంధ్రప్రదేశ్ సంచికలో 30 పేజీలోని డైరీ 1956 నవంబరు నెలకు సంబంధించినది.



వరంగల్లులోని వెయ్యి స్తంభాల దేవాలయంలో రాష్ట్రప్రభుత్వ ప్రధాన కార్యదర్శి



**17-1-1967** తేదీన రాష్ట్ర ముఖ్యమంత్రి చిన్నమొత్తాల పొదుపుపక్షానికి ప్రారంభోత్సవంచేస్తున్న దృశ్యం